# ॥ ప్రజ్ఞా పురాణం ॥

## ప్రథమ ఖండం

## ఉదార భక్తి భావన ప్రకరణం

*హిందీ మూలం:*
వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ఠ
**పండిత శ్రీరామశర్మ ఆచార్య**
**గాయత్రీతీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్ - 249411 (ఉ.ప్ర)**

*తెలుగు అనువాదం:*
**నేమాని గౌరీసావిత్రి**
సాహిత్య రత్న(హిందీ)

**గాయత్రీ తీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్.**
గాయత్రీ చేతనా కేంద్రము, హైదరాబాదు.

ప్రజ్ఞా పురాణం - ప్రథమ ఖండం

# ఉదార భక్తి భావన ప్రకరణం

*ద్వితీయ ముద్రణ:*
సర్వజిత్ నామ సంవత్సర మార్గశిరం

**ప్రతులు : 5000**

**మూల్యము: రూ. 18 /- లు**

*డి.టి.పి., ముఖచిత్ర రూపకల్పన:*

**దేవీప్రసాద్**

**ప్రజ్ఞా గ్రాఫిక్స్, గుంటూరు.**

*ముద్రణ:*

**శ్రీదత్తసాయిగ్రాఫిక్స్, హైదరాబాదు.**

GAYATRI CHETANA KENDRA & MEDITATION CENTRE

*ప్రతులకు:*

గాయత్రీ చేతనా కేంద్రము మరియు ధ్యాన మందిరం
అశ్వినిహౌస్ వద్ద, మూసాపేట, హైదరాబాదు -500 018

## ॥ తొలిపలుకు ॥

మానవుని ఎట్టెదుట సాక్షాత్కరించే అనేక సమస్యలకు పరిష్కారాన్ని తెలిపే కథలు, ప్రసంగాలు అనేకం భారతీయ ఇతిహాసాలలోను, పురాణాలలోను వ్రాయబడి ఉన్నాయి. కాలం యొక్క అవసరాన్ని, ఈనాటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, ఈ యుగ సమస్యలను పరిష్కరించగల కొన్ని ప్రసంగాలను, కథలను ఈ "ప్రజ్ఞాపురాణం"లో పొందుపరిచాము. యుగవేదాంతం నిండి ఉన్న ఈ పురాణంలోని శ్లోకాలు, సందర్భాలు నవీనమైనవిగా ఉన్నా, దీనిలో పొందు పరచిన సత్యాలు! సనాతమైనవి, శాశ్వతమైనవి. దీనిలో సమగ్ర మానవ ధర్మానికి వన్నె తెచ్చే అనేక ఇతిహాస పురాణ కథలే కాక ఇతర మతాలకు చెందిన వారికోసం ఇతర ధర్మావలంబులైన ప్రజల కోసం కూడా అనేక కథలు సేకరించటం జరిగింది.

కాలం ఒకేలా ఉండదు. మార్పు దాని సహజ లక్షణం, మారే కాలంతో పరిస్థితులు, సమస్యలు, సంప్రదాయాలు, విలువలు కూడా మారుతూనే ఉంటాయి. ఈ శాశ్వత సృష్టిని, మారేకాలాన్ని దృష్టిలో ఉంచుకొని కాలానుగుణంగా మార్గదర్శనాన్ని ఇవ్వగల సాహిత్యాన్ని సమాజానికి అందివ్వ వలసిన బాధ్యత ఎంతైనా ఉంది. అన్నిరకాల మానసిక స్థితి కలవారినీ, వారి వారి పరిస్థితులను దృష్టి యందుంచుకొని, వారికి సౌకర్యాన్ని ఇవ్వాలనే తలంపుతో ఈ గ్రంథ రచన సాగింది. దీనివలన నా ఏకాంత సాధనకు ఇబ్బంది కలిగినా ఒకేసారిగా ఈ పురాణం 4 ఖండాలుగా సృష్టించబడ్డాయి. ఈ యుగ పురాణాన్ని సనాతనమైన 18 పురాణాల వలెనే 18 ఖండాలుగ లిఖించాలనే కోరిక ఉన్నది. భవిష్యత్తు మన చేతుల్లో లేకపోయినా చేతిలోని కలం ఆగనంటూ పరిగెడుతూనే ఉంటుంది.

ప్రాచీన కాలంలో 18 పురాణాలు లిఖించబడ్డాయి. అవి చాలవంటూ మరో 18 ఉపపురాణాలు లిఖించ బడ్డాయి. వీటిలో మొత్తం 100,00,000 శ్లోకాలున్నాయి. అంతేకాక నాలుగు వేదాలలోను మొత్తం 20 వేల మంత్రాలున్నాయి. ఇంకా చాలా కథా సాహిత్యం లిఖించబడింది. ఈ కథాసాహిత్యం అంతా త్రాసులోని ఒక సిబ్బెలోను, మిగిలిన మొత్తం సాహిత్యం రెండవ సిబ్బెలోను పెడితే కథాసాహిత్యం పెట్టిన సిబ్బెవైపే మొగ్గు చూపుతుంది అంటే అతిశయోక్తికాదు. వేదాంతపరమైన ప్రవచనాలు, ప్రతిపాదనలు వికసించిన మనోభూమి కలవారికి మాత్రమే అవగతమవుతాయి. కానీ కథలు శిక్షితులను, అశిక్షితులను, బాలలను వృద్ధులను, స్త్రీలను, పురుషులను అందరినీ అలరిస్తాయి. కథాసాహిత్యం కేవలం లోకరంజనమే కాదు లోకమంగళం కూడా.

పర్వదినాలలో అనేక అనుష్ఠానాలు ఆచరిస్తూ ఉంటాం. అలాంటప్పుడు విధిగా ప్రజ్ఞాపురాణ ప్రవచనాలు వినిపించాలి. మొదటిరోజు దేవపూజ, వ్రతధారణ, మంగళాచరణ కావించి, ఉదయం ఒక గంట సాయంత్రం ఒక గంట. ఒక్కొక్క ఖండం ఒక్కొక్కరోజు సంక్షిప్త పరిచయం ద్వారా వినిపించవచ్చు. ఆఖరు రోజు పాయసం, ఖిచిడీ వంటి పదార్థాలతో సామూహికంగా ప్రీతి భోజనాలు చేసి, ఆ తరువాత సంస్థయొక్క బ్యానర్స్‌తో శోభాయాత్ర (ఊరేగింపు) జరిపించాలి. ఈ ప్రీతి భోజనం, శోభాయాత్రల వల్ల వ్యక్తుల మధ్య కులమతాలు మొదలైన అనేక అడ్డుగోడలు తొలగి ప్రవచనాలు నూటికి నూరుపాళ్ళు ఫలించే అవకాశాలు ఉన్నాయి.

ఈ గ్రంథాలను వ్యక్తిగత స్వాధ్యాయానికి ఉపయోగిస్తే వ్యక్తి శక్తిగా మారగలడు. సామూహిక సత్సంగాలలో ఉపయోగిస్తే జనజాగృతి జరిగి తీరుతుంది. రాత్రి నిద్రించే ముందు కుటుంబ సభ్యులు అంతా కలిసి చదువుకొంటే నిద్రలో సూక్ష్మ శరీరాలకు సందేశాలు అందుతాయి. చిన్నపిల్లలకుఈ పురాణం అత్యంత ప్రీతికరమైనది. అలాగే వృద్ధులకు ఈ పురాణం ధర్మపరంపరను అవగతం చేయటానికి అత్యంత సహాయకారిగా తోడ్పడుతుంది. ఈ పురాణం రోజూ దేవాలయాల్లో వినిపిస్తే పలాయన వాదానికి అలవాటుపడ్డ ఆలయాలు జాగృతి కేంద్రాలుగా అనతికాలంలోనే మారిపోతాయి.

లోకశిక్షణకు గోష్ఠులు, సభలు, సమావేశాలు ఎంతో అవసరం, కానీ వేదాంతపరమైన ఉపన్యాసాలు అక్కడ వినిపించటం వల్ల సామాన్య జనులకు అర్థంకాక విసిగి పారిపోయి పలాయనవాదానికి అలవాటు పడతారు. కానీ ఈ పురాణంలోని కథలు, ప్రసంగాలు నెలల తరబడి వినిపించినా ఇంకా వినాలనిపించేటంత ఆసక్తికరంగా ఉంటాయి. హృదయానికి హత్తుకొంటాయి. యుగశిల్పులకు, ప్రజ్ఞాపరిజనులకు లోక శిక్షణార్థం ఒక అమూల్యమైన “నిధి” ప్రజ్ఞాపురాణ రూపంలో అందజేయబడింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ప్రతి ప్రజ్ఞాపీఠంలోను, ప్రశిక్షణా కేంద్రంలోను, ప్రతి సభలోను, ప్రతి సమావేశంలోను ప్రజలకు “యుగసందేశం” గా ప్రజ్ఞాపురాణం వినిపించండి.

ప్రథమఖండంలో యుగసమస్యల కారణంగా ఉద్భవించిన అవిశ్వాసం యొక్క వివరణ ఈయబడింది. దాని నుండి బయటపడి ఎలా ప్రజ్ఞాయుగాన్ని క్రియారూపంలో అవతార శక్తిద్వారా ప్రవేశ పెట్టగలమో సందేశ రూపంలో అందించబడింది. భ్రష్ట చింతనలు, దుష్ట ఆచరణల నుండి బయటపడి ఆధ్యాత్మ విలువలను వ్యవహారిక రూపంలో ఏ విధంగా ఉపయోగించుకోవచ్చో తెలియజేసే విస్తృత వివరణ దీనిలో ఇవ్వబడింది. చివరకు “మహాప్రజ్ఞ” యొక్క ఆలంబన ద్వారా లభింపగల సత్యయుగ వాతావరణ పరిస్థితుల వెలుగులు వెదజల్లబడ్డాయి.

ఈ నా రచనలో ఎక్కడైన అనుచితంగానీ, అసందర్భం గానీ, గోచరించినా, అక్షర తప్పులుగానీ, ముద్రణ లోపాలుగానీ ఉన్నా విజ్ఞులు నాకు తెలియజేయండి. ఆనందంగా స్వీకరించి తరువాత ప్రచురణలో అలా జరగకుండా చూసుకొంటాను.

**– శ్రీరామశర్మ ఆచార్య**

## ఉదార భక్తి భావన ప్రకరణం

బ్రహ్మ విద్యా శిబిరంయొక్క నాల్గవ దినముకూడా సమావేశమైన ఋషి పుంగవులందరితోను శోభామయమానంగా ఉన్నది. అద్వితీయమైన సూక్ష్మబుద్ధిగలవాడు, తర్క ప్రవీణుడు అయిన ఉద్దాలకుడు మొట్టమొదటి పంక్తిలో ఆసీనుడై ఉన్నాడు. ఆయనలో నిండి ఉన్న ఉత్సాహం, కుతూహలం స్పష్టంగా మహర్షి కన్నులకు కనపడసాగింది. ఉద్దాలకుడు లేచి నిలబడి మహర్షికి పాదాభివందనంచేస్తూ యేమన్నాడంటే :

శ్లో॥ సమయోపయోగే యః ప్రోక్తో మహాభాగాత్ర కర్మణా ।
తత్రైకోదేవ! సందేహః సర్వేషాం సముదేతియత్ ॥
సమయాక్షేపవల్లాభప్రాప్తిస్తు తత్ సమన్వయాత్ ।
కిం భవిష్యద్ధైతావన్మాత్రేణాత్మిక ప్రోన్నతేః ॥
కృతేత్వా వశ్యకః సేత్స్యత్యాత్మనో విస్తరః కథం ।
సీమా బంధన మాత్రం తు నియతేః కర్మ భాగ్యవత్ ॥

ఓ మహాత్మా! కర్మద్వారానే సమయం యొక్క సదుపయోగం అవుతుందని గతంలో మీరిచ్చిన విశ్లేషణ ద్వారా నాకొక సందేహం కల్గుతోంది. అందరూ ఒకే విధమైన కర్మ చేయుటలేదు. కర్మ విధి వ్యవస్థయొక్క మర్యాదా బంధనం. అటువంటప్పుడు కర్మ ఆత్మ ప్రగతికి అనివార్యమైనదిగా భావించటం వల్ల వ్యక్తియొక్క లక్ష్యం సిద్ధించదు కదా! విధి వ్యవస్థ ననుసరించియే జీవుడు కర్మ చేసేటప్పుడు 'అహం' అనేదాన్ని వదలడం, ఆ అనంత తత్వంలో తనని తాను విలీనం చేసికోవటం ఎలా వీలవుతుంది ? ఇది తెలిస్తే గాని చర్చ సంపూర్ణం గాదు; అంతేగాక –

శ్లో॥ శృంఖలాయాంతు తస్యామాబద్ధా హేతునా సదా ।
అస్తవ్యస్తతా యాస్తదనౌచిత్యం నిరుధ్యతే ॥
క్రమప్రాప్తాని దాయిత్వాన్యుచితం ఓఢుమేవతు ।
సంభవేయుస్తథా తస్యాం సీమాయాం యేస్థితః ప్రభోః ॥
తరంగాః కథమా పూర్తిస్తేషాం కర్తుం తు సంభవేత్ ।
ఆత్మానం భక్తిభావేన విదధాత్యను ప్రాణితం ॥
తదమృతం కథం పాతుం శక్యతేతి సవిస్తరం ।
సర్వసాధారణస్యాలం కల్యాణం యది సంభవేత్ ॥

ఒక క్రమ పద్ధతిలో చేసుకొంటూ పోయే కర్మ, బాధ్యతా నిర్వహణ ఇవి జీవితంయొక్క వ్యావహారిక పక్షానికి చెంది జీవికి, జీవితానికి న్యాయం చేయవచ్చు. ఇవికాకుండా హృదయాల నుండి ఉద్భవించి పొంగి పొరలే ఉన్నత స్థాయికి చెందిన సంవేదనలు, పారమార్థిక చింతనలు ఆత్మను అనిర్వచనీయమైన

**ఆత్మబలం లోపించిన వ్యక్తిలో శ్రద్ధ స్థిరపడదు.**

శాశ్వతానందానుభూతికి కొనిపోగలవు. ఇదే ఆత్మలో నిండియున్న పరమాత్మ తత్త్వం. ఇది కరువైన జీవితాలు శుష్కమై, నిష్ప్రయోజనంగా మిగిలిపోతాయి. అయితే ఈ అమృతత్వాన్ని జీవితంలో వర్షింప చేసికోవటం ఎట్లా ? దీనిద్వారా తాను లాభాన్వితుడవటమే గాక ఇతరులకు కూడా ఎలా లాభాన్ని చేకూర్చాలో తెలియజాలని నాడు ఆధ్యాత్మ వేదాంతం యొక్క విశ్లేషణ అర్థాంతరంగా మిగిలిపోతుందని ఉద్దాలక మహర్షికి బాగా అవగతమైంది.

మనిషికి ప్రకృతిద్వారా లభించిన సంపదలు నియమపూర్వకంగా సంరక్షించుకోవటం, సరియైన విధంగా ఉపయోగించుకోవటం అవసరమే; కాని స్థూలదృష్టితో మాత్రమే చూచే వ్యక్తులు మానవ జీవిత వికాసానికి ఇంతవరకూ చాలునని ఇకపైన యేమీ అవసరం లేదని తప్పుడు అభిప్రాయం కల్గి ఉంటారు. మానవుడు తన కౌశల్యానికి, వ్యవస్థకి పరిమితమైనవాడు కాదు. ఇంతవరకే పరిమితమై ఉన్నట్లయితే సంవేదనలు, అనుభూతులు ఆత్మీయతలు వంటి భావాల యొక్క అవసరంగాని సంగీతం, నాట్యం, కవిత్వం వంటి కళలయొక్క అవసరంగానీ ఏ మాత్రము ఉండేది గాదు.

తల్లి పుత్రప్రేమకోసం తన సర్వసుఖాలను తృణప్రాయంగా వదలివేయగలదు. అలాగే బిడ్డ తల్లి వక్షస్థలం మీద విశ్వంలోనున్న సర్వసుఖాలను అనుభవించగలడు. భార్యాభర్తలు పరస్పర ప్రేమానురాగాలతో దారుణమైన విపత్తులను కూడ నవ్వుతూ సునాయాసంగా ఎదుర్కొనగల్గుతారు. ఇటువంటి వన్నీ అంతరంగంలో ప్రవహించే అమృత ధారలయొక్క బాహ్యాభివ్యక్తి మాత్రమేగాని పై పై కార్యకలాపాలు ఎంతమాత్రము కాదు.

శ్లో॥ **కర్మణ స్సమయస్యాపి కుర్వంతస్తే సమన్వయం ।**
**మహత్వకాంక్షిణో మోహగ్రస్తా దృశ్యంత యేవహి ॥**
**శ్రమశీలా అనేకేచ ప్రయాస పరితత్పరాః ।**
**ప్రాప్యంతే భిన్నమేతన్న సంతితే కర్మయోగినః ॥**

సమయం, కర్మ ఈ రెండింటి యొక్క సమన్వయంతోను అనేకమంది మోహగ్రస్తులు మహత్వ కాంక్షాపరులు కూడ లాభాలను పొందుతూనే ఉంటారు. నిత్యజీవితంలో అనేకమైన కర్మలు యంత్రాల ద్వారా సునాయాసంగా జరగడం చూస్తూనే ఉన్నాము. అంతేగాక యాంత్రిక కర్మ కూడా సాఫల్యానికి జన్మధాత్రిగా అంగీకరించబడుతూనే ఉంది. కర్మయోగులే కానవసరం లేదు. శ్రమశీలురు, కష్టించేవాళ్ళు గూడా ఎన్నో లాభాలు పొందుతుండటం మనం చూస్తూనే ఉన్నాము. కానీ ఆ లాభాలకు కారణం పురుషార్థం అని మాత్రమే అంటాము. జీవన సంపదను సార్థకంచేసిన వారుగా వారిని ఎలా అంగీకరించగలం? శ్రమశీలత, కర్తవ్య పరాయణత, సువ్యవస్థ, వీటిని మించిన తత్త్వం యేదో జీవితంలో దాగియున్నదని, అది కరువైతే జీవితాలు జీవిత సాధనలు కూడ అసంపూర్ణంగా మిగిలిపోతాయని పేర్కొంటూ దానిని గూర్చి విశదంగా తెలుపమని జిజ్ఞాసువులందరి తరపున ఉద్దాలక మహర్షి కోరటం జరిగింది. సూత్రసంచాలకుడు, బ్రహ్మవేత్తయైన పిప్పలాద మహర్షి మందస్మిత వదనారవిందుడై జిజ్ఞాసువుల నుద్దేశించి ఈ కథలను వినిపించటం జరిగింది.

**కథ 1 : స**ందీపుడు కాశీరాజ కుమారుడు. ఆయన బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి వ్యాయామం, గుర్రపుస్వారీ మొ॥ వన్నీ క్రమశిక్షణతో చేసేవాడు. విద్య, విజ్ఞానం, పాండిత్యం, రాజకార్యాలపట్ల అపరిమితమైన

శ్రద్ధ అన్ని విధాలైన శుభలక్షణాలతో క్రమశిక్షణలో పెరుగుతూండేవాడు. జీవితంలో ఒక్కక్షణాన్ని కూడా వృథా చేసేవాడు కాదు. ఒకనాడు ఈయన గుఱ్ఱం మీద బయలుదేరి నగరమంతా తిరుగుచుండగా నగర పౌరులు స్నేహానురాగాలతో అతడిని చుట్టుముట్టారు. ఇంతలో ఒక కుఱ్ఱవాడు ప్రమాదవశాన రాజకుమారుని గుఱ్ఱం డెక్క తగిలి నేలమీదపడి విలవిలలాడసాగేడు. రాజకుమారుడు ఇదంతా ప్రత్యక్షంగా చూసికూడ కించిత్ వ్యథ చెందటంగానీ, సానుభూతి చూపటంగానీ చేయక జాగరూకతతో మెలగని వారికి ఇటువంటి పరస్థితులే ఎదరవుతాయంటూ నిర్లక్ష్యంగా ముందుకు సాగిపోయాడు. రాజకుమారుని ఈ చర్యకు నగర ప్రజలు నిశ్చేష్ఠులయ్యారు. రాజకుమారుని నిరసించారు. ఈ విషయం విన్న రాజకుమారుని తండ్రి ఎంతగానో దుఃఖిస్తూ ఎన్ని ఉన్నప్పటికీ అసలైన భావ సంవేదనలు తన కుమారునిలో కరువైన సంగతిని అవగతం చేసుకొంటాడు. **వ్యక్తి కేవలం సక్రియుడై యథావిధిగా కార్యకలాపాలు సాగించినంత మాత్రాన జనాదరణకు, శ్రద్ధకు పాత్రుడు కాజాలడు.** ఇటువంటి వ్యక్తులు హఠాత్తుగా క్రూర కర్ములుగా మారినా మారవచ్చును అని గుర్తించి రాజు కుమారునికి గురుకులంలో విద్యాభ్యాసం శిక్షణ ఇప్పించే నిమిత్తం అన్ని ఏర్పాట్లు చేయించసాగాడు.

**కథ 2 : భా**రతీయ సంస్కృతి, చరిత్ర ద్వారా "ఋషిపరంపర స్త్రీ పాత్ర గురించి" మనకు స్పష్టంగా అవగతమౌతుంది. భారతభూమిపై ఉద్భవించిన ప్రతి మహాత్ముడు గురుకులాల్లో ఋషి పత్నులు, ఋషి కన్యల ద్వారానే పెంచి పోషించబడ్డారు. కణ్వాశ్రమంలో శకుంతల ద్వారా భరతుడు, వాల్మీకి ఆశ్రమంలో సీతద్వారా లవకుశులు యే విధంగా పెరిగి పెద్దవారైనదీ మనందరకూ తెలుసును. మదాలస సంరక్షణలో పెరిగిన బిడ్డలు అద్వితీయమైన బ్రహ్మజ్ఞానులు, భావ సంపన్నులూ అవుతారు.

మాతృహీనులైన బిడ్డలు అనేక మంది భావశూన్యులుగానూ, సంవేదనా శూన్యులుగాను తయారై చుట్టూ ఎంతటి అనుకూల పరిస్థితులున్నప్పటికీ వాటిని చిందర వందర చేయటం జరిగింది. భావ సంవేదనా క్షేత్రంలో స్త్రీ, పురుషునికంటే ఎల్లవేళలా చాలా ముందుంటుంది.

**కథ 3 : మ**హాత్ముడైన ఆనందస్వామి వద్దకు ఒక ధనవంతుడు వచ్చి, అయ్యా! నావద్ద అనేక కార్ఖానాలున్నాయి. సంపద, సుఖాలతో నేను కన్న బిడ్డలందరూ నాకు దూరంగా తమ పనులలో తాము లీనమైయున్నారు. భార్య స్వర్గస్థురాలైంది. నా చుట్టూ వైభవ సామ్రాజ్యం తాండవమాడుతున్నా ఏదో కొరత నన్ను కలచివేస్తోంది. ఆకలి, నిద్ర నాకు దూరమయ్యాయి అంటూ రోదించసాగేడు. ఆనందస్వామి ఆ ధనవంతుని కథ విని "నాయనా! నీవు నీ జీవితంలో శ్రమకు, కర్మకు మాత్రమే ప్రాధాన్యతనిచ్చి నీ చుట్టూ వైభవ సామ్రాజ్యాన్ని నిర్మించుకొన్నావు. భావ సామ్రాజ్యాన్ని సంపాదించి పెట్టగల **సత్సంగ, స్వాధ్యాయం** వంటి వాటిని ఉపేక్షించావు. నీ ఆలోచనలకు శక్తి లభించి అంతరంగాన్ని శుష్కస్థితి నుండి బైట పడవెయ్యటానికి ఇకపైన ప్రేమను, శ్రమను పంచటం మొదలుపెట్టు. అనాథలు, నిర్ధనుల మధ్యకు వెళ్ళి వారిని స్వావలంబులుగా మార్చటానికి శ్రమించు. నీ శరీర శ్రమ ఎంత ఎక్కువగా ఈ పుణ్యకార్యంలో వెచ్చించగల్గితే అంతగానూ నీకు ఉల్లాసం, ఆనందం లభించి నీ ఆకలి, నిద్ర తిరిగి నీవద్దకు చేరుకొంటాయి అని తెలియజేస్తాడు. ధనవంతుడు మహాత్ముని ఆదేశాన్ని తు.చ. తప్పక అమలుపరుస్తాడు. గతంలో ఎన్నడూ పొందని ఆశ్చర్యకరమైన శాంతిని సత్ఫలితాలను పొంది ఆనంద సామ్రాజ్యానికి చక్రవర్తి అవుతాడు.

**సార్థక జీవనానికి పునాదిరాయి జ్ఞానం.**

**శ్లో॥ అహం క్రమిక చర్చాయాం తస్మిన్నేవ ప్రసంగకే ।**
**ఆసం చర్చితు కామస్తు సాధుత స్మారితంత్వయా ॥**
**అధునా తత్ప్రసంగేతు వక్తుముత్సాహ ఏషమే ।**
**వృద్ధింగతో భవద్భిశ్చ శ్రావ్యమగ్రే సచిత్తకైః ॥......**

ఓ ఋషిపుంగవులారా! ఈ విధి వ్యవస్థలో ఈశ్వరుడు, జీవి, ప్రకృతి మూడు ఉన్నట్లే చైతన్య క్షేత్రంలో కూడా జ్ఞానం, కర్మ, భక్తి అనే మూడు ఉన్నట్లుగా విజ్ఞులు పేర్కొన్నారు. ఈ మూడింటిని విద్యార్థులు అధ్యయనం చేసిన రీతిలోనే ఒక్కొక్క విషయాన్ని అధ్యయనం చేస్తూ తరువాతదాన్ని జోడిస్తూ పెంచుకొంటూపోవాలి.

రెండు వస్తువుల కలయికవల్ల మూడవ రూపం యేర్పడుతుంది. రాత్రి పగలు కలయిక వలన సంధ్య యేర్పడుతోందే గానీ ఈ సంధ్య రాత్రిగానీ, పగలుగానీ కానేకాదు. ఈ రెండింటి అస్థిత్వము సంధ్యా కాలంలో దాగియున్నది. సరిగ్గా ఇదే విధంగా జీవుడు కూడా పరబ్రహ్మ, ప్రకృతి ఈ రెండింటి కలయికవల్ల యేర్పడిన మూడవరూపం. చైతన్య బ్రహ్మయొక్క గుణాలైన ఆత్మచేతన, అంతఃకరణ భావనల రూపంలో మనలోపల విరాజిల్లుతున్నాయి. ప్రకృతి జడమైనది. కాబట్టి శరీరాకృతి మొత్తము జడమైనదే. కాని జీవి యొక్క చైతన్యం జడత్వం ద్వారానే పయనిస్తోందనేది ప్రతి ఒక్కరూ గుర్తించ వలసిన విషయం. ఈ విధంగా సృష్టియొక్క వ్యవస్థ ననుసరించి చైతన్య జగత్తులో గూడ సచ్చిదానంద రూపుడైన పరబ్రహ్మ యొక్క లక్షణాలు జ్ఞాన, కర్మ, భక్తిధారలుగా జీవశక్తి యొక్క ప్రగతి మార్గాన్ని నిర్ధారణ గావిస్తూ దృష్టి గోచరమవుతూనే ఉన్నాయి. వ్యక్తి యొక్క విశిష్టతను బట్టి ఈ మూడు విడివిడిగానూ హెచ్చుతగ్గులుగానూ దృష్టి గోచరమైనప్పటికీ ఈ మూడు అన్యోన్యాశ్రితమైనవి; అత్యంత మహత్వపూర్ణమైనవి. ఒకటి లేక వేరొకటి పరిపూర్ణతను పొందజాలవు అని మహర్షి జిజ్ఞాసువులకు విశదపరస్తూ ఇంకా సరళంగా తెలియచెప్పే తలంపుతో ఒక కథను వినిపించారు.

**కథ 4 : ఒ**క వ్యక్తి ఆత్మ, మరణానంతరం యమధర్మరాజు ఎదుట హాజరు పరచబడింది. ఈ వ్యక్తి తపో సంపన్నుడనీ, నిండు యన్వనంలోనే తల్లిదండ్రులను, అలుబిడ్డలను, భవబంధనాలను త్యజించివేసి తపో భూమికి పోయిన ధన్యుడని యమదూతలు తెలియ చెబుతారు. యమధర్మరాజు చిరునవ్వునవ్వి స్వకుటుంబీకులపట్ల విశ్వాస ఘాతాన్ని ఆచరించి కర్తవ్యాలను ఎగవేసి ఇతను చేసిన తపస్సు ఆధ్యాత్మ చింతన మహాపాపంగా లెఖ్ఖించబడింది. కాబట్టి ఇతడు దేవలోకం వంక కన్నెత్తి చూడడానికైనా అర్హుడు కాడు. వెంటనే భూలోకానికి పంపి బలవంతంగానైనా ఇతని కర్తవ్యాలను ఇతడు ఆచరించేటట్లు చూడండి అని దూతలకు ఆజ్ఞాపిస్తాడు. ప్రక్కనున్న రెండవ ఆత్మ గురించి దూతలను ప్రశ్నించగా ఇతడు గొప్ప కర్తవ్య పరాయణుడని భార్య జబ్బుపడి మరణించినా గోరంత చలించక తన కార్యనిర్వహణలో అనవరతము లీనమై తన పనినే సర్వస్వంగా భావించే వాడని దూతలు తెలియజేస్తారు. యమధర్మరాజు క్రోధ దృక్కులతో అతనివంక చూచి హృదయహీనుడా! నీ వెంత కర్తవ్య పరాయణుడవైనప్పటికీ స్వర్గంలో క్షణమైనా ఆగడానికి వీలులేదు. నైతికమైన కర్తవ్యాలను విస్మరించి ఆచరించే మిగిలిన కర్తవ్యాలన్నీ పరుగుపందెం వంటివే. భావనాపూర్వకమైన కర్తవ్యమేదైతే ఉన్నదో అది మాత్రమే సర్వశ్రేష్ఠమైనది. కాబట్టి భావనాశీలుడవై ఇతరులను ప్రేమిస్తూ భూలోకంలో జీవించు అని ఆదేశిస్తాడు.

**మన కర్తవ్యాన్ని ఉపేక్షిస్తే, మనం స్వయంగా నష్టపోతాము.**

ఇంతలో మూడవ ఆత్మ ప్రవేశపెట్టబడుతుంది. దూతలు యమునకు నమస్కరించి, ధర్మరాజా! ఈ ఆత్మ ఒక సాధారణ గృహస్థుది. సర్వవేళల ఆస్థికతను పరిపూర్ణ నిష్ఠతో పాటిస్తూ పవిత్ర జీవనం గడుపుతూ ప్రేమపూర్వకమైన కుటుంబ జీవితాన్ని గడిపి వారిని పెంచి, పోషించి, వికసింప చేయటమేగాక ఆదా చేయగల్గిన సమయాన్ని సంపదను పరుల మేలుకొరకు వెచ్చిస్తూ జీవితం గడిపిన వాడు అని తెలియచేస్తారు. ధర్మరాజు ప్రసన్నుడై ఆ ఆత్మను దీవిస్తూ నాయనా ! స్వర్గం నీవంటి వారి కోసమే నిర్మించబడింది. కాబట్టి సగౌరవంగా స్వర్గ పట్టణానికి పంపిస్తాను. నీవు కావాలంటే స్వర్గాన్ని భూమి మీదకు కూడా నీ కోసం దింపగలను అంటూ ఆయనను దూతలకు అప్పగిస్తాడు.

జీవితం యొక్క పూర్ణ వికాసానికి జ్ఞానం, కర్మ, భక్తి ఈ మూడింటి సమన్వయం అనివార్యం. కానీ అనేక మంది ఏదో ఒక్కదానిని పట్టుకొని వ్రేలాడుతూ ఆ సాలెగూటిలోనే ఊగిసలాడుతూ కాలాన్ని దొర్లిస్తూ ఉంటారు.

**కథ 5 : అ**జమహారాజు నిర్వహిస్తున్న యజ్ఞ కార్యక్రమానికి వశిష్ఠమహర్షి ప్రధాన పురోహితుడుగా ఆహ్వానించ బడతాడు. మార్గమధ్యంలో ఒక వ్యక్తి వశిష్ఠునకు నమస్కరించి దుఃఖిస్తూ, దేవా! నేను నిరంతరం శ్రమిస్తూ సదాచార సంపన్నుడిగా జీవిస్తూ, సమస్త గ్రంథాలను స్వాధ్యాయం చేసి జ్ఞానాన్ని ఆర్జించాను. కానీ పూర్ణత్వాన్ని పొందలేకపోయాను. ప్రజల ఆదరాభిమానాలను ఏమాత్రం పొందలేకపోయాను. ఏదో కొరత నన్ను నిరంతరం వేధిస్తోంది అని తెలియజేస్తాడు.

క్షణకాలం కన్నులు మూసుకొని మహర్షి అతని మనోవేదనకు, ఓటమికి కారణాన్ని తెల్సుకొంటాడు. వాత్సల్యంతో ఆ వ్యక్తి భుజం తట్టి, నాయనా! నీవు కర్మ, జ్ఞానం ఈ రెండు ప్రవాహ ధారల వెంట తత్పరతతో పయనించేవు. కానీ భావపక్షాన్ని పూర్తిగా విస్మరించేవు. నీవు ఆర్జించిన జ్ఞానాన్ని స్నేహంతో అందరకూ పంచు. నీవు ఆచరించే కర్మలో ప్రేమను మిళితంచేయి. సమస్త జీవధారలలోను నీ ఆత్మ కలసి ఉన్నదన్న సత్యాన్ని గ్రహించి భక్తి ప్రవాహం గుండా ఎల్లలు లేకుండా ప్రవహించు. ఆ నీ ప్రవాహదిశను పరమాత్మ యొక్క అక్షయ ఆనంద రూపమైన గంగ దిశగా మళ్ళించి ఆ గంగలో కలసిపోనీయ్. అలా చేసిననాడు నీ దుఃఖం దూరమవుతుంది. శ్రేయస్సు, జనాదరణ సర్వం నీకు లభిస్తాయి అని మహర్షి తెలియచేస్తాడు. ఆ వ్యక్తి ఆనంద పరవశుడై మహర్షి ఆదేశానుసారం జీవిత విధానాన్ని మార్చుకోవటానికిసంకల్పం తీసుకొంటాడు. కాలక్రమేణ అతడు ఇచ్చిన దానికి అనేక రెట్లు పొందసాగేడు.

**శ్లో॥ అధ్యాత్మనస్తు క్షేత్రస్య వికాసక్రమ పద్ధతౌ ।**
**సర్వప్రథమమధ్యాత్మ జ్ఞానస్యాస్తి హి భూమికా ॥**
**సాన చేన్మానవోజాడ్య భవబంధన పాశితః ।**
**తిరశ్చామివ సంబద్ధః శిశ్నోదర పరాయణః ॥**
**వాసనాయాశ్చ తృష్ణాయ అతిరిక్త మధాపిచ ।**
**అహంతయా సజ్ఞాతుం న ప్రభవేత్ స్థితిరీదృశీః ॥**
**ఆత్మజ్ఞాన మిదం యేన స్వరూపం మానవః స్వకమ్ ।**
**కర్తవ్యంచ భవిష్యచ్చ ద్రష్టుం పారయతి ధృవమ్ ॥**

**ఆధారేణస ఏతేన సుషుప్తిం తాం విహాయహి ।**
**జాగృతా విశతి ప్రోక్తః దేవజన్మాత్మ బోధకః ॥**

అధ్యాత్మ క్షేత్ర వికాసక్రమ మార్గంలో ఆత్మజ్ఞానానికి ప్రథమ స్థానం ఇవ్వబడింది. ఆత్మజ్ఞానం కరువైతే మానవుడు జడత్వం యొక్క భవబంధనాలలో బంధింపబడి శిశ్నోదర పరాయణుడిగా బ్రతుకు ఈడుస్తూ అహానికి, కామక్రోధ మోహాలకీ బందీయై జీవిస్తాడు.

కేవలం ఆత్మజ్ఞానం వలన మాత్రమే మానవుడు తన స్వరూప స్వభావాలను, భవిష్యత్తును, కర్తవ్యాలను తెల్సుకోగలడు. ఆత్మజ్ఞానంవల్లనే వ్యక్తి సుషుప్తావస్థను వీడి జాగృతావస్థలో ప్రవేశించగలడు. "ఆత్మబోధన"ను దేవజన్మగా పేర్కొనటం జరిగింది.

లౌకిక ఆధ్యాత్మిక క్షేత్రాలలో జ్ఞానం యొక్క స్థానం వేరే విధంగా ఉంటుంది. బాహ్యమైన క్రియా కలాపాలకు, జీవిత వ్యవహారం యొక్క విభిన్న క్షేత్రాలకు ఆత్మజ్ఞానం పూర్తిగా భిన్నంగా ఉంటుంది. జ్ఞానం ప్రకాశం (వెలుగు)గా పేర్కొనబడింది. ఎవరికైతే అసలైన జ్ఞానం లభిస్తుందో వారు పశుస్థాయి నుండి పైకి చేరి మానవ జీవితం యొక్క లక్ష్యాన్ని మానవుడుగా తాను భూమిమీదికి దిగిరావటంలో గల ఉద్దేశ్యాన్ని అవగతం చేసుకొంటాడు. ఇతర జీవరాసులకు మధ్య గల అంతరం ఇదే. మానవుని అంతర్ నేత్రం తెరచుకొని లోపల వెలుగు ప్రసరించేసరికి అతడు తినటానికి, కనటానికి పరిమితమై ఉన్నా మన్న తన చిరసంచిత ప్రవృత్తుల ద్వారా ప్రేరేపించబడే కార్యక్రమాలను వీడి ఆత్మ ప్రగతి యొక్క మహాత్మ్యాన్ని అవగతం చేసుకొంటూ ఆమార్గం వెంబడి ముందుకు ప్రయాణించటం ప్రారంభిస్తాడు. ఆత్మజ్ఞానం కొరవడటం వల్లనే చైతన్య ప్రాణధారియైన మనుజుడు జడుడుగాను, ఊగిసలాడే మొక్కగాను నిరూపించబడుతున్నాడు.

ఆత్మజ్ఞాన ప్రకాశం అంతరంగంలోనికి ప్రవేశించగానే మానవుడు నిద్రావస్థకు స్వస్తి చెప్పి జాగృత స్థితికి చేరి వెలుగులు వెదజల్ల నారంభిస్తాడు.

**కథ 6 : వి**వేకానందుడు రామకృష్ణుని వద్ద కూర్చొని నమస్కరించి, ఓ మహాత్మా! మానవుడు శ్రేష్ఠుడు, విచారశీలుడు అయినప్పటికీ ఒక దానికొకటి ఏ మాత్రం సంబంధంలేని రెండు విధాలైన భిన్న ప్రవృత్తులు వ్యక్తిలో దృష్టి గోచరమవుతున్నాయి. ఒక స్థాయికి చెందినవారు నికృష్టస్థితిని ఇష్టపడితే రెండవ స్థాయికి చెందినవారు ఉత్కృష్ఠతను పరమార్థ పరాయణతను ఇష్టపడుతూ ఉంటారు. దీనికి కారణం ఏమటని ప్రశ్నిస్తాడు.

పరమహంస చిరునవ్వు నవ్వి, నాయనా! రెండు సిబ్బెలుగల త్రాసులో ఒక వైపు భారం ఎక్కువై వంగితే రెండవ వైపు తేలిక అయి పైకి లేస్తుంది. మానవుని మనస్సు కూడా త్రాసువంటిదే. దానికి ఒకవైపు భౌతిక జగత్తు, రెండవ వైపు భగవంతుడు ఉంటారు. **లౌకికమైన పేరు ప్రతిష్ఠలు, సుఖభోగాలు కోరుకొనే వారి భారం ఎక్కువగా ఉంటుంది. వారి మనస్సు భగవంతుని వైపు పైకి లేచి లౌకికమైన వాటిపట్ల వంగి ఉంటుంది.**

వైరాగ్యం, వివేకం, ఆత్మజ్ఞానం వల్ల ప్రబల ఉత్కంఠ ఎవరి మనస్సుని బరువెక్కిస్తే వారి మనస్సు లోకం వైపు నించి బాగా పైకిలేచి భగవంతుని పట్ల వంగి ఉంటుంది అని తెలియజేస్తాడు.

**మౌనం మనిషికి ఉత్తమోత్తమ ఆభరణం.**

**కథ 7 : మ**హాత్ముడైన రామానుజునికి ఒక గృహస్థు నమస్కరిస్తూ, అయ్యా! ఈ కుటుంబాన్ని సంపదను ఏవీ వదలనదానికివసరం లేకుండా స్వర్గాన్ని పొందే ఉపాయం ఏదైనా చెప్పమని అడుగుతాడు. దానికి రామానుజుడు, వత్సా! స్వర్గం ఎక్కడో లేదయ్యా. నీవు నీ అంతరంగం లోనికి తొంగిచూస్తే చాలు నీకు నీ యదార్థ స్వరూపం అవగతమవుతుంది. నిద్రపోయే శక్తులను మేల్కొల్పి మానవుడుగా వ్యవహరించినట్లయితే స్వర్గ సుఖాలను అనుభవించటానికి తగిన పాత్రత నీకు లభిస్తుంది. అని తెలియజేస్తాడు. కానీ గృహస్థు సంతృప్తి చెందక ఓ మహాత్మా! మీరు చెప్పినవన్నీ గృహస్థు ధర్మాన్ని వదలి సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవారికే సాధ్యమవుతాయని చెప్తారే! అది ఎంత వరకు సమంజసం ? అని ప్రశ్నిస్తాడు. దానికి రామానుజుడు, నాయనా! ఆత్మ కల్యాణం పట్ల నిజమైన శ్రద్ధ, నిష్ఠకల వ్యక్తి గృహస్థ ధర్మాన్ని నిర్వహిస్తూనే నరపశువుగా కాక నరనారాయణుడుగా జీవించగలడు. నరకయాతనల నుండి రక్షణ కల్పించుకోవాలనే కోరిక, అభ్యుదయం – వీటినే ఆత్మజాగృతి అంటారు అని తెలియజేస్తాడు.

**కథ 8 : గౌ**తమి యొక్క ఏకైక సంతానం మరణిస్తాడు. ఆమె శోకాన్ని భరించలేక బుద్ధుని వద్దకు వచ్చి బిడ్డను బ్రతికించుమని ప్రార్థిస్తుంది. బుద్ధుడు ఆమెను ఓదారుస్తూ, ఇంతవరకూ ఒక్క మృత్యువైనా సంభవించని గృహంనుండి గ్లాసు నీళ్ళు తీసుకొని రమ్మనీ వాటిని మంత్రించి జల్లితే బిడ్డ బ్రతుకుతాడనీ తెలియజేస్తాడు. గౌతమి ఇంటింటికి తిరిగి తిరిగి నిరాశతో తిరిగివచ్చి బుద్ధునికి నమస్కరిస్తుంది.

బుద్ధుడు ఆమెకు జ్ఞానోపదేశం చేస్తూ, అమ్మా ప్రకృతి యొక్క శాశ్వత నియమం అయిన ఈ జనన మరణ చక్రంలో తిరుగాడే మనం ఒకరికోసం మరొకరు దుఃఖించటం వృధా. 'చావు' అనేది లేని వ్యక్తి అంటూ విశ్వంలో ఎవ్వడు ఉండడు. అందరూ నేడో రేపో సమయం ఆసన్నమవగానే మరణించక తప్పదు అని తెలియజేస్తాడు. గౌతమి లభించిన ఆత్మజ్ఞానం ద్వారా శోకాన్ని శాంతింపచేసుకొని మృత పుత్రునికి అంత్యక్రియలు జరిపించింది.

**కథ 9 : య**క్ష యుధిష్ఠిర సంవాదంలో యక్షుడు ధర్మరాజుని "బ్రాహ్మణత్వం" అనేది దేనివలన సిద్ధిస్తుంది? అని ప్రశ్నిస్తాడు. బ్రాహ్మణత్వం అనేది కులం వల్లగానీ, శాస్త్రాధ్యయనం వల్లగానీ, ఆచార వ్యవహారాలవల్ల గానీ, స్వాధ్యాయ సత్సంగాల వల్లగానీ లభించేది కాదు. సదాచార సంపన్నుడైన వ్యక్తి ఆత్మబోధ ద్వారా అజ్ఞానాన్ని దూరం చేసికొని ద్విజత్వాన్ని పొందుతాడు అని ధర్మరాజు బదులు పల్కుతాడు.

**కథ 10 : "భ**గవద్గీత"లో కృష్ణార్జున సంవాదంలో జరిగిన చర్చ అందరికీ తెలిసినదే. ఇది ప్రతీవ్యక్తి యొక్క అంతరంగ స్థితికి సంబంధించినది. అర్జునుని మోహాన్ని చూచి సూత్ర సంచాలకుడైన కృష్ణభగవానుడు కూడా ఆశ్చర్యచకితుడవుతాడు. పైకి శక్తి వంతుడుగా కనిపిస్తున్న అర్జునుని అంతరంగంలోని దైన్యం, పిరికితనం, మూర్ఖపు ప్రవర్తన వీటిని నిరసిస్తూ అతనికి కృష్ణుడు ఆత్మబోధ చేస్తాడు. ఈ ఆత్మబోధే అర్జునుని పునర్జన్మగా చెప్పవచ్చు. భగవంతుని నిర్దేశానుసారం పయనించటానికి అర్జునుడు ఉద్యుక్తుడవుతాడు. అది ఆత్మబోధ ద్వారా లభించిన ఉపలబ్ధి అని అంగీకరించక తప్పదు. అంతరంగం ఏ సందేశాన్ని ఇస్తే దానిని ఈశ్వరీయ ప్రాప్తి తరువాత లభించిన "ఈశ్వరీయ సందేశం"గానే భావించి పయనించినపుడు వ్యక్తి లక్ష్య సిద్ధిని విధిగా పొందగలడు.

**జాతికి సంపద వెండి బంగారాలు కాదు - సజ్జనులు.**

**కథ 11 : స్వా**మి రామతీర్థుడు ప్రసిద్ధి చెందిన భారతీయ విద్వాంసుడు. అధ్యయనం పట్ల వీరికి గల ఆసక్తి, సున్నిశితమైన బుద్ధి చూచి లాహోర్ కాలేజీ ప్రిన్సిపాల్ ప్రభావితుడై రామతీర్థుని సివిల్ సర్వీస్ పరీక్షకు పంపాలని నిర్ణయిస్తాడు. రామతీర్థునికి ఈ విషయం తెలియగానే ఆయన ప్రిన్సిపాల్ వద్దకు వెళ్ళి నమస్కరించి, అయ్యా! నేను నా పంటతో లాభాలు గడించాలని దానిని అమ్మలేదు. **నేను పండించిన పంట** పదిమందితో కలసి పంచుకొని తినటానికి పండించాను కాబట్టి పెద్ద ఆఫీసర్ని కావాలనే కోర్కెనాకులేదు. నేను సేవకుడిని. సేవ చేయటానికే పుట్టిన వాడిని కాబట్టి సేవచేస్తాను. దీనికి ఆఫీసరు పదవి అవసరం లేదు. అధ్యాపక వృత్తి సరిపోతుంది అని తెలియజేస్తాడు. ప్రిన్సిపాల్ ఎంత చెప్పినా వినక తన నిర్ణయం పట్ల దృఢంగా నిలబడతాడు. తనకున్న జ్ఞానాన్ని కర్మ మార్గంతో జోడించగల ప్రతివ్యక్తి స్వామి రామతీర్థునిలా నాటిన విత్తనాలకి అనేక రెట్లు ఫలితాన్ని పొందగల్గుతాడు. ఈ విధమైన ఆత్మబోధ ఎవరికి ఎప్పుడు కల్గినా వారు మహామానవులుగా కీర్తించబడతారు.

శ్లో॥ **ఆత్మప్రేరణయోదేతి కృపయాచ గురోరయమ్ ।**
**యోహి జీవనక్షేత్రస్య ప్రథమా భూతిరుచ్యతే ॥**
**ఇమం యేప్రాప్నువన్త్యభ్యుదయ ద్వార మనావృతమ్ ।**
**కుర్వన్త్యగ్రే సరన్త్యేతే ముఖ్యలక్ష్యదిశి ధృవమ్ ॥**

**ఈ ఆత్మప్రేరణ, ఆత్మబోధ గురు కృపవలన లభిస్తాయి. దీనిని జీవిత క్షేత్రంలోని ప్రథమ ఫలంగా చెప్పవచ్చు. ఈ కృపను పొందిన వ్యక్తి అభ్యుదయ ద్వారాలను సునాయాసంగా తెరచి పరమలక్ష్యదిశగా తన పయనాన్ని అవలీలగా సాగించగల్గుతాడు.** అధ్యాత్మ క్షేత్రంలో మార్గదర్శకుని పాత్ర అత్యంత మహత్వపూర్ణమైనది. పురుషార్థం తన పని తాను నిర్వర్తించినప్పటికీ, నలుదిక్కులా వ్యాపించిన భ్రమల సాలిగూటి నుండి బయట పడవేసి లక్ష్యం వైపు వేలు పట్టుకొని నడిపించగలవాడు గురువు మాత్రమే.

జీవితం ఎందుకు లభించింది ? జీవితాన్ని ఎలా సార్థకం చేసుకోవాలి ? అనేవి తెలియజెప్ప గలవాడు కూడా గురువు ఒక్కడే. ఆత్మప్రగతికి ద్వారాలు ఒక్కసారి తెఱుచుకోబడితే చాలు మార్గంలో ఏ అవరోధం లేకుండా పయనం సునాయాసంగా సాగిపోతుంది.

భక్తకబీరు "భగవంతునితో సంబంధ బాంధవ్యాలు ఏర్పరచగలవాడు గురువే కాబట్టి గురువుని ఎంతగా కీర్తించినా ఇంకా అది తక్కువనే" చెప్పాలి అంటాడు.

పరమహంస, చాణక్య, సమర్థ గురు రామదాసు, బుద్ధుడు, ప్రాణనాథ మహాప్రభువు, గాంధీ వీరికి లభించిన శిష్యులకు ఆత్మబోధ కల్గించటం వల్లనే వివేకానందుడు, చంద్రగుప్తుడు, శివాజి, ఆనంద్, అశోకుడు, ఛత్రసాల్, నెహ్రూ, పటేల్ వంటి మహానుభావులు ఆవిర్భవించేరు. గురువు అనేవాడు అలభ్యమైన పారసమణి వంటివాడు. గురువు తన స్పర్శ మాత్రం చేత లోహపు ముక్కలను కూడా బంగారంగా మార్చివేయగలడు.

**కథ 12 : మ**హాత్ముడైన దాదూదయాల్ గృహస్థ జీవితం గడుపుతూ జీవనోపాధికోసం వ్యాపారం చేసేవాడు. ఒకనాడు సాయంత్రం ఆయన తన ఆదాయాన్ని లెక్కపెట్టుకొంటూ దుకాణంలో పనిలో లీనమై ఉంటాడు. బయట వర్షం పడుతోంది. కొంతసేపు అయిన తరువాత దాదూ తల త్రిప్పి చూడగా గురువు

వర్షంలో తడుస్తూ కనిపిస్తాడు. దాదూ గాబరా పడుతూ లేచివెళ్ళి అంతవరకు చూడ నందుకు క్షమించుమని వేడుకొంటాడు.

గురువు అతన్ని వారిస్తూ, వత్సా ! నీవు నన్ను చూశావు, పిలిచేవు. సరే కానీ నీ గుమ్మంముందు ఎప్పటినుండో భగవంతుడే నిలచి ఉన్నాడు. ఆయనను ఎందుకు లోనికి రమ్మని పిలవలేకపోతున్నావ్ అని ప్రశ్నించాడు.

ఆమాట దాదూ హృదయంలో గ్రుచ్చుకొన్నది. ఆమాటే అతడిని మహాత్మునిగా మార్చివేసింది. గురువులాగనే దైవాన్ని కూడా తీసుకొనివచ్చి తన ఇంట కూర్చోపెట్టుకొనే వరకు నిద్రపోలేదు. దైవాన్ని తన ఇంటికి ఆహ్వానించి తృప్తిగా ఊపిరితీసుకొంటాడు.

**కథ 13 : స్వా**మి విరాజానంద కుటీరంలో ధ్యానమగ్నుడై ఉండగా మూలశంకర్ అనే ఆయన స్వామీజీకి తన ఉనికిని తెలియజేస్తూ బయట నిలబడ్డాడు. కుటీరం లోపల నుండి "ఎవరు" అని ప్రశ్న వినిపించింది. " అది తెల్సుకోవాలనే వచ్చాను స్వామీ" అని బదులుపల్కుతాడు. నిరీక్షణ ఎంత కాలంగానో? రా! రా! త్వరగా లోనికి అంటాడు స్వామీజీ.

**జ్ఞానచక్షు సంపన్నుడైన గురువు ఇటువంటి సాహసంకల జిజ్ఞాసువును లోపలకు ఆహ్వానించిన ఆక్షణాలే మూలశంకర్‌కు "స్వామి దయానంద"గా జన్మను ప్రసాదిస్తాయి.**

గురువు అతడిని అన్నివిధాలా పరీక్షించాడు, ఆత్మబోధ కల్గించాడు. అటుపైన ఆదేశిస్తూ, సమాజంలో వ్యాపించిన అనాచారం, మూఢవిశ్వాసం, ధర్మం పేరిట జరిగే ఆడంబరం వీటిని అరికట్టటానికి ఒంటరిగానే బయలుదేరుమంటాడు. గురుదేవుడు ప్రసాదించిన అనంతమైన శక్తితో బయలుదేరి దయానందుడు నెమ్మదిగా విశ్వమంతా వ్యాపించాడు.

**కథ 14 : అ**నావృష్టికి గురియైన ప్రజల సహాయార్థం వారికి పని కల్పిస్తూ ఛత్రపతి శివాజీ ఒక వంతెన నిర్మాణం గావిస్తుంటాడు. అక్కడ పనిచేస్తున్న కూలీలనందర్నీ చూచి శివాజీ తన దయవల్లనే ఇన్ని వేలమంది ప్రజలు కూలి చేసుకొని కడుపు నింపుకొంటున్నారని, తానా పనిని వారికి కల్పించి ఉండకపోతే ఆకలితో మాడి మరణించి ఉండేవారని భావిస్తూ గర్వంతో పొంగిపోతాడు. ఆ దారివెంట వెళుతూ సమర్థగురు రామదాసు ఆస్థితిలో శివాజీని చూచి పరిస్థితిని అవగతం చేసుకొని మౌనంగా ఊరుకొంటాడు. తరువాతరోజు శివాజీని వెంటబెట్టుకొని ఒక మార్గం గుండా పయనిస్తూ దారిలో కనిపించిన ఒక పెద్దరాయిని శివాజీకి చూపి దానిని కదలించగలవేమో ప్రయత్నించుమంటాడు. అతి సునాయాసంగా వీరశివాజీ రాయిని ఎత్తి పడవేశాడు. రాయిక్రింద ఒక గొయ్యి, గోతిలో నీళ్ళు, నీటిలో కొన్ని కప్పలు గెంతుతూ కన్పించాయి. సమర్థగురు రామదాసు శివాజీ వంకచూచి ఈ రాయి క్రింద ఈ కప్పలకోసం, ఇంతటి సౌకర్యం, రక్షణ బహుశా నీవే కల్పించివుంటావు. నీ ఔదార్యం వల్లనే ఇవి మాడి మరణించకుండా ఉల్లాసంతో జీవితాలు గడుపుతూ ఉండి ఉంటాయి. అవునా! అని తీక్షణంగా ప్రశ్నించాడు. శివాజీ సిగ్గుతో తల వంచుకొంటాడు. ఇలా ప్రతి విషయంలోను సమర్థగురు రామదాసు శివాజీకి వాస్తవాన్ని, కర్తవ్యాన్ని సూటిగా స్పష్టంగా తెలియచెప్పేవాడు. కేవలం ఆయన అనుగ్రహం మార్గదర్శనం లోనే శివాజీ అడుగడుగునా ఆపదలను అధిగమిస్తూ శ్రేయోమార్గంలో పయనించి గొప్ప వాడవుతాడు.

**క్రోధాన్ని జయించిన వ్యక్తి అందరినీ జయిస్తాడు.**

**కథ 15 :** నరేంద్రుడు తరచుగా పరమహంస వద్దకు **దక్షిణేశ్వరానికి** వెళుతూ ఉండేవాడు. త్రికాలజ్ఞుడైన పరమహంసకు నరేంద్రుని భావి స్వరూపం తెలుసు. కానీ సంసార బంధనాల నుండి శిష్యుణ్ణి విడిపించి, ఆత్మబోధ చేయడానికి ఆయనకు చాలా సమయం పట్టింది. ఎందుకంటే నరేంద్రునికి ఎన్ని అవకాశాలు కల్పించినా పరమహంస ముందు అతడెప్పుడూ తన ఉద్యోగం గురించే నివేదించేవాడు. ఇంక చిట్టచివరకు పరమహంస నీ సమస్య కాళీమాత చరణాలవద్ద సమర్పించు అంటూ ఆదేశించాడు. ఆ విరాట్ స్వరూపాన్ని దర్శించి ముగ్ధుడైన నరేంద్రుడు భవబంధ విముక్తుడై ఉద్యోగం మాట మరచి ఆత్మశక్తిని, భక్తిని మాత్రమే కోరుకొని తిరిగివస్తాడు. రామకృష్ణుని మార్గదర్శనంలో లభించిన ఈ కాళీమాత సాక్షాత్కారమే ఆనాడు నరేంద్రుని వివేకానందునిగా మార్చివేసింది. సద్గురు ప్రాప్తి గొప్ప మహద్భాగ్యం. ఇవి ఎవరికి, ఎప్పుడు, ఎవరిద్వారా లభించినా వారు పరమ లక్ష్యాన్ని చేరుకోగల్గుతారు. అంతేగాక మార్గంలో ఎదురయ్యే అవరోధాలన్నింటినీ అవలీలగా అధిగమించి ముందుకు పయనించగల సామర్థ్యం వీరికి లభించి తీరుతుంది.

**శ్లో॥ ఆత్మ ప్రగతి సోపానం ద్వితీయం కర్మచోచ్యతే ।**
**కర్మార్థాత్ కర్మయోగోయం కర్మయోగస్యసోర్థతః ॥**
**మనుష్యతా పక్ష్యధర కర్తవ్యానీతి మన్యతాం ।**
**అథాప్యుత్తరదాయిత్వం పరిపాలన మేవచ ॥**

ఆత్మప్రగతి యొక్క రెండవ సోపానం కర్మ. కర్మ అంటే కర్మయోగం. మానవత్వానికి సంబంధించినటువంటి బాధ్యతలను, కర్తవ్యాలను నిర్వర్తించటం పట్ల అప్రమత్తత కల్గియుండి, సంచిత కుసంస్కారాల కారణంగా ఉత్పన్నమయ్యే దుష్ప్రవృత్తుల పట్ల నియంత్రణను పాటిస్తూ, స్వభావంలో సత్ప్రవృత్తులు వృద్ధి చేసుకొంటూ మానవుని యొక్క ప్రామాణికత, ప్రతిభలను ఋజువు చేయగల్గిన దానినే కర్మయోగమని అంటారు.

ప్రజ్ఞాశిబిరం యొక్క మూడవరోజు సంయమశీలతా, కర్తవ్య ప్రకరణాలకు సంబంధించిన చర్చలో పిప్పలాద మహర్షి కర్మయోగము, సంయమనము వీటి మధ్యగల ఘనిష్ఠ సంబంధాన్ని తెలియచేస్తూ "ఉన్నతమైన ఉద్దేశ్యాలతో జోడింప బడిన కర్తవ్యాలను నిర్వర్తించటం వల్లనే మానవుడు విశ్వంభరుడుగా చెప్పబడుతూ ఉంటాడని" తెలియచేస్తారు. తిరిగి ఈనాడు మానవుని చేతనాక్షేత్రం యొక్క మూడు ధారలను గూర్చి చర్చిస్తూ వారు ఆత్మజ్ఞానం తరువాత కర్మనిష్ఠకు ప్రాధాన్యత నీయటం జరిగింది.

కర్మ అందరూ చేస్తారు. కానీ ఆత్మప్రగతికి సంబంధించిన కర్మయోగంయొక్క విశిష్టతను తెలియచేయవలసినపుడు మానవత్వంతో జోడింపబడి దిశాబద్ధమైనప్పుడే అది పురుషార్థాన్ని ఫలింపచేసి సాఫల్యాన్ని కల్గిస్తుందని పేర్కొనబడింది. ఇటువంటి కర్మయోగులు అనంతమైన నమ్మకంతో ఈశ్వరుడు తమకు అప్పగించిన బాధ్యతలను భక్తి ప్రవృత్తులతో నిర్వర్తిస్తూ దానితోబాటు ఆత్మ నియంత్రణను అభ్యాసం చేస్తూ తమ ప్రతిభను పూర్తిగా సత్ప్రయోజనాలలోనే వినియోగిస్తారు.

**కథ 16 :** కర్మనిష్ఠ ఆత్మజ్ఞానంతో సంయోగం చెందితే మహత్వపూర్ణమైన చమత్కారాలు జరుగుతాయి. వ్యక్తి ఏమంటే అది జరిగితీరుతుంది.

**జన్మజన్మలకూ మనవెంట వచ్చేది దేవత్వ సంపద.**

జైతవన్ అనే నగరానికి చెందిన సీమక్ అనే శ్రేష్ఠి కడుపిసినారి. దీని కారణంగా ఆయనను కొడుకులు, కోడళ్ళు, బంధువులు ఎవ్వరూ కూడా గౌరవించేవారుకాదు. సరిగ్గా ఆ నగరంలోనే మహీధరా చార్యుడు అనే ఆయన ఇంటింటికి అందించాలనే కోర్కెతో వేదాలకు భాష్యం వ్రాశాడు. వేదజ్ఞానాన్ని ఇంటింటికి పంచటము అత్యంత ఆవశ్యకమైనదిగా తెలిసికూడా ధనాభావం వల్ల ఆయన దానిని అచ్చు వేయించలేకపోయాడు. ఇది ఇలా ఉండగా కర్మనిష్ఠుడై సీమక్ ధనంతోసహా మాయమైనట్లు వార్త సర్వత్రా వ్యాపించింది. చూస్తూండగానే ఇంద్రజాలంవలె మహీధరాచార్యుని వేదభాష్యం ఇంటింటికి అందించబడసాగింది. గర్భదరిద్రుడైన ఆచార్యులవారికి ఈ పని ఎలా సాధ్యం ? అని ప్రజలు పర్యవేక్షణ ప్రారంభించారు. సీమక్ రూపురేఖలుగల వ్యక్తి ఈ మహత్కార్యాన్ని నిర్వర్తిస్తున్నట్లు గుర్తించి అందరూ ఆశ్చర్యచకితులవుతారు. కర్మనిష్ఠ, ఆత్మజ్ఞానాల సంయోగంవల్ల ఇటువంటి ఆశ్చర్యకరమైన చమత్కారాలు జరుగుతూ ఉంటాయి.

**కథ 17 : ఒ**క బ్రాహ్మణుడు జీవితం మొత్తం మీద నాల్గు మహాయజ్ఞాలను నిర్వర్తిస్తాడు. అయినా ఆయన అంతిమకాలంలో పరిస్థితులు ఎంతగానో దిగజారి దారిద్ర్యాన్ని భరించలేక నాల్గింటిలో ఒక యజ్ఞఫలాన్ని ధర్మరాజుకి అమ్మి జీవిత చరమాంకాన్ని సుఖంగా గడపాలని బయలుదేరుతాడు. మార్గమధ్యంలో ఆకలివేసి ఒక చెట్టు క్రింద కూర్చొని తనవద్దనున్న రొట్టెలమూటను విప్పుకొంటాడు. ఇంతలో పదిరోజులుగా ఆకలి బాధతో పరితపిస్తున్న ఒక సన్యాసి చెట్టుక్రిందకు వచ్చి చేయిజాపుతాడు. బ్రాహ్మణుడు ఆ దరిద్ర నారాయణునకు నమస్కరించి సగౌరవంగా తన రొట్టెలనన్నింటినీ సన్యాసికి సమర్పించి తను గ్లాసుడు నీళ్ళుత్రాగి ధర్మరాజు వద్దకు చేరుకొంటాడు. ధర్మరాజు బ్రాహ్మణుని చూచి సంగతి గ్రహించి, అయ్యా! నీవద్ద ప్రస్తుతం ఐదు యజ్ఞాలఫలమున్నది. వీటిలో దేనిని అమ్మదలచుకొన్నావని అడుగుతాడు. ఐదవ యజ్ఞం మాటవిని బ్రాహ్మణుడు ఆశ్చర్యచకితుడౌతాడు. ధర్మరాజు అదిగమనించి, బ్రాహ్మణుడా! నీ జీవితకాలంలో ఆచరించిన నాలుగు యజ్ఞాలు, దారిలో నీవు కష్టాన్ని సహిస్తూకూడా కష్టంలో ఇతరులకు సహాయం చేయాలి అనే భావనతో సన్యాసికి సమర్పించిన రొట్టెలు అక్షయ యజ్ఞంగా నిర్ధారించబడింది. కాబట్టి ఎక్కువ ధర పల్కే అక్షయ యజ్ఞాన్ని అమ్ముతావా? మిగిలిన నాల్గింటిలో దేనినైనా అమ్మదలిచావా? అని తిరిగి ప్రశ్నిస్తాడు. బ్రాహ్మణుడు ఆనందపరవశుడై తన శేషజీవితాన్ని దారిద్ర్యంతో క్రుంగకుండా పరోపకారానికే వినియోగించాలనే సంకల్పం తీసికొంటాడు.

పతితులను పైకి తీసికొని రావటం, పథభ్రష్ఠులకు దారిచూపటం **అన్నిటినీ మించిన యజ్ఞాలు** అని పై కథ తెలియచేస్తుంది.

**కథ 18 : ఒ**కవ్యక్తి రోజుల తరబడి బయటే గడుపుతూ ఎప్పుడో ఒకప్పుడు ఇంటికి వస్తుండేవాడు. అతడు ఎప్పుడు వెళ్ళేది, ఎప్పుడు వచ్చేది ఇరుగు పొరుగు వారికి గూడా అంతుబట్టక ఒకనాడు ప్రక్కింటి ఒకస్త్రీ ఆయనను పిలచి, అయ్యా! నీవేమిపని చేస్తుంటావు? కనీసం వేళకి తిండినైనా పట్టించుకోకుండా తిరుగుతావెందుకని? ఆమె ప్రశ్నించింది. ఆయన చిరునవ్వునవ్వి అమ్మా! ప్రస్తుతం నేను జీవితంలోని మూడవ అధ్యాయంలో ఉన్నాను. కనీసం ఇప్పుడైనా పూజ, భగవత్ సేవ వంటి పారమార్థికమైన కర్మలు ఆచరించాలి గదా! ఆ పనిలోనే తిరుగుతూ ఉంటానని బదులు పల్కుతాడు. ఇరుగు పొరుగు వారికి ఈ మాటలు నమ్మకంగా తోచలేదు. భగవత్ సేవ ఇంట్లో ఉండి కూడా చేసుకొన వచ్చునే. ఇదేదో తెలిసికొనవలయునని రహస్యంగా అతడిని వెంబడించసాగారు. తీరా వారు కనుగొన్నదేమంటే అతడు

గ్రామ గ్రామం వ్యాయామశాలలు నెలకొల్పి ప్రజలకు శిక్షణ ఇస్తూ ఉంటాడనీ, పూజ, భగవత్ సేవ అని అబద్ధం చెపుతాడు అని ఇరుగు పొరుగువారు కోపించి ఇంటికి రాగానే ఆయనపై విరుచుకుపడతారు. అటుగా వెళుతూ ఇది గమనించిన సమర్ధగురు రామదాసు ప్రజలనుద్దేశించి సోదరులారా! **తమ సామర్థ్యాన్ని సత్ప్రయోజనాలలో లగ్నంచేసి, రాష్ట్రాన్ని శక్తివంతంగా, సమర్థవంతంగా తయారుచేయాలని తపించే పరమార్థ పరాయణుడైన వ్యక్తి అందరినీ మించిన దైవభక్తుడు.** కాబట్టి, ఈ భక్తుడు చెప్పిన మాటలో పొరపాటు ఏమీలేదని తెలియచేస్తూ ఆ వ్యక్తిని అక్కున చేర్చుకొంటాడు.

**కథ 19 : ఒ**కవ్యక్తి క్షామపీడితమైన తన ప్రాంతాన్ని వదలి కుటుంబ సమేతంగా మరొక ప్రదేశానికి వెళ్ళి ఒక తోటమాలి పనిని సంపాదిస్తాడు. లభించిన పనిపట్ల శ్రద్ధ, భక్తి కల్గియుండి లభించిన దానితో తృప్తి చెందుతూ దానిలోనే కొద్దిగా ఆదాచేసి క్షామపీడిత ప్రాంతాలలో అల్లాడేవారికి సహాయం చేసేవాడు. ఒకనాడు యజమాని ఇంటికి బంధువులు రాగా మంచి మామిడి పండ్లనుకోసి తెమ్మని యజమాని ఇతనిని ఆజ్ఞాపిస్తాడు. కోసితెచ్చిన పండ్లన్నీ పుల్లగా ఉన్నాయనీ బంధువులు అసంతృప్తిచెందగా యజమాని కోపించి ఇన్ని సంవత్సరాలుగా తోటలో పనిచేస్తున్నా ఏ పండ్లుపుల్లగా ఉంటాయో, ఏ పండ్లు తియ్యగా ఉంటాయో తెలియదా నీకు ? అని నిందిస్తాడు. తోటమాలి సవినయంగా, అయ్యా! ఇతరులు ఒక పండైనా అపహరించకుండా రక్షించవలసిన నేను మీరివ్వనిదే మీ పండ్లను యేవిధంగా భక్షించి రుచిచూడగలను? నా వృత్తి ధర్మం పట్ల అప్రమత్తుడనైయున్న కారణంగా ఈ రోజు మీకు బాధ కల్గించి ఉంటే క్షమించుమని కోరటం తప్ప ఇంకేమీ చేయలేని అసమర్థుడనని చేతులెత్తి నమస్కరిస్తాడు. యజమాని నిశ్చేష్టుడై, కర్మనిష్ఠుడు, నిర్లోభియైన తోటమాలికి ప్రతి నమస్కారం చేస్తాడు.

ఈ విశ్వ ఉద్యానవనాన్ని కర్మయోగివలె రక్షించవలసిన బాధ్యత ప్రతి మానవునికి ఉంది. ఈ బాధ్యతా నిర్వహణలో ఎంత సావధానంగా ఉంటే వ్యక్తి అంతటి శ్రేయస్సును, సత్కారాన్ని పొంది ఆనందంగా జీవించగల్గుతాడు. అంతేగాక అనేక మందికి ప్రేరణనిస్తూ మార్గదర్శకుడై వెలుగొందుతాడని పైకథ తెలియచేస్తుంది.

**కథ 20 : అ**శోకుని రాజ్యంలో అనావృష్టి సంభవించి ప్రజలు ఆకలి దప్పులతో అలమటిస్తున్న సమయమది. అశోకుడు అన్న రాశులను, అన్న సత్రావులను యేర్పాటుచేసి ఉదయం మొదలు సాయంత్రం వరకు విరామంలేకుండా అన్నదానం చేయించసాగాడు. ఒకరోజు భోజన వితరణ సమయం పూర్తియై అందరూ నిష్క్రమిస్తూ ఉండగా ఒక వృద్ధుడు ఆకలితో వచ్చి అన్నం పెట్టుమంటాడు. కానీ వారు నిరాకరించి సమయం ముగిసిపోయిందని రేపు ఉదయాన్నే రమ్మని వృద్ధుని పంపివేస్తారు.

అంతలో ఒక యువకుడు త్వరత్వరగా అచటకు వచ్చి నిరాశతో తిరిగి వెళుతున్న వృద్ధుని పిలిచి భోజనం పెట్టేవారితో, అయ్యలారా! ఈ వృద్ధుడు అన్నం కోసం చాలా సేపటి నుండి నిరీక్షిస్తున్నాడు. వృద్ధాప్యం వలన జనసమ్మర్ధంలోనికి చొచ్చుకొని రాలేక వెనుకనే ఉండిపోయాడు. దయఉంచి కాస్త అన్నం పెట్టుమని అర్థిస్తాడు. అతని వాక్కు యొక్క మహత్తు యేమోగానీ, అక్కడున్నవారు వెంటనే భోజనం పెడతారు. యువకుని సహాయంతో వృద్ధుడు అన్నాన్ని మూటకట్టుకొని చీకటి పడింది ఎలా గుడిశెకు వెళ్ళాలా అని ఆలోచిస్తూ ఉండగా యువకుడు అతని పరిస్థితి అర్థంచేసుకొని అన్నంమూటను తానే పట్టుకొని అతనికి తోడుగా

నడవసాగాడు. మార్గమధ్యంలో ఒక సైనిక బృందం ఎదురువచ్చింది. ఆ సేనానాయకుడు గుఱ్ఱాన్ని దిగి యువకునికి సైనిక వందనం చేస్తాడు. వృద్ధుడు ఇది చూచి ఆశ్చర్యచకితుడై నీవెవ్వరో చెప్పుమని యువకుణ్ణి ఒత్తిడి చేస్తాడు. యువకుడు చిరునవ్వు నవ్వి నేను శక్తిగల్గిన ఒక యువకుణ్ణి. నీవు శక్తిలేని వృద్ధుడివి. చాలు ఇంతకంటె ఎక్కువ పరిచయం దేనికి? నీ ఇల్లు ఎక్కడో పద అంటూ ముందుకు అడుగులు వేయబోతాడు. వృద్ధుడు ఆ యువకుణ్ణి పూర్తిగా గుర్తుపట్ట గల్గుతాడు. వెంటనే యువకుని పాదాలమీద వ్రాలి ఓ ప్రభూ! నీవు మమ్మల్ని పరిపాలించే ప్రభువువే కాదు. నిజమైన కర్మయోగివి అంటూ నమస్కరిస్తాడు.

అశోకునివంటి కర్మయోగులకు సంపద, కీర్తి, ప్రతిష్ఠ, ఒకటేమిటి సర్వస్వం సునాయాసంగా లభిస్తాయి. కానీ వారికి వాటియందు కోర్కెలేకుండా ఉన్నప్పుడే అది కర్మయోగం అనిపించుకొంటుంది.

**శ్లో॥ వర్ధ్వతే చేద్ వికాసస్య క్రమేణానేన కర్మచ ।**
**యుజ్జతే ప్రౌఢయాతాతి తతో భక్తి ర్విజృంభతే ॥**
**క్రీడంతియే వార్భకాస్తేచ క్రీడంత్యపి కిశోరకాః ।**
**ప్రౌఢాః క్రీడంతి కుర్వంతి పౌరుపౌపార్జనాన్యపి ॥**
**జ్ఞానస్య కర్మణో భక్తే త్రివేణీసే దృశం మాతా ।**
**గంగా యమున యోర్యోగే యధాశుభ్రా సరస్వతీ ॥**

వికాసక్రమం వృద్ధి చెందేకొలదీ జ్ఞానంతోబాటు కర్మ జోడించబడుతూ ఉంటుంది. కర్మ ప్రౌఢత్వాన్ని సంతరించు కొనేకొలదీ దానివెంట భావవీచికలు వెదజల్లబడతాయి.

బాలుడు కేవలం ఆటలతో కాలంగడుపుతాడు. ఇదే బాలుడు కిశోరావస్థకు వచ్చేసరికి ఆటలతో బాటు చదవడం కూడా ప్రారంభిస్తాడు. ఇదే బాలుడు యువావస్థలో కదుగిడగానే ఆడటం, చదవటంతోపాటు తన పురుషార్థంతో ఆర్జనను కూడా మొదలుపెడతాడు. ఇదే విధంగా జ్ఞానం, భక్తి, కర్మల సంగమం గంగా యమున సరస్వతీల సంగమంవలె త్రివేణీ సంగమం. జ్ఞానం, కర్మల కలయిక ద్వారా కలిగే సాధన సరియైన దిశలో సాగుతున్నప్పుడు దానిలోనికి భక్తియొక్క క్రొత్త ధారలు కూడా వచ్చిచేరతాయి. ఆత్మవికాసం ప్రౌఢదశకు చేరినపుడు జ్ఞానం కర్మలతోబాటు భక్తియొక్క క్రొత్త కెరటాలు ఉప్పొంగుతాయి.

సద్జ్ఞానంతో ప్రేరేపించబడిన కర్మలలో భావనయొక్క సమావేశం అంతరంగపు పరిపక్వతకు చిహ్నం. ఇదే ఆధ్యాత్మ ప్రగతికి చివరిమెట్టు. భావసంపదనలు, శ్రేష్ఠతయొక్క కెరటాలు జీవితంలో సమావేశం అవ్వటమంటే ఈశ్వరునిపట్ల శ్రద్ధకు విశ్వాసానికి తన అంతరంగంలో స్థానాన్ని ఇవ్వటమే. జ్ఞానాన్ని కర్మను తన జీవితంలోని సత్ప్రయోజనాలతో జోడించిన వ్యక్తికి భక్తియొక్క భావతరంగాలు వాటంతట అవే ఉప్పొంగుతాయి. జ్ఞానం, భక్తి, కర్మల త్రివేణి సంగమం తీర్థరాజంగా ప్రతిఒక్కరి అంతరంగంలోను విరాజిల్లుతోంది. దీనిలో పుణ్యస్నానమాచరించి ప్రతిఒక్కరూ జీవితాన్ని పునీతం చేసుకోవచ్చు.

**కథ 21 : కో**సలరాజైన ప్రసేనచిత్తుడు పరివ్రాజక ధర్మాన్ని స్వీకరిస్తాడు. అలాగే గౌతమి మహిళలకు శిక్షణనిచ్చి సాధనచేయించి కార్యక్షేత్రంలో ప్రవేశపెట్టే బాధ్యతను స్వీకరించింది. ప్రసేనజిత్తుని సోదరియైన సుమననుకూడా పరివ్రాజక వృత్తిలో ప్రవేశపెట్టాలని ఆమె ఆత్రుత చూపేది. ఇది గమనించిన తథాగతుడు గౌతమిని వారిస్తూ "ఆమెను ముందు గృహస్థ ధర్మాన్ని పరిపూర్ణ నిష్ఠతో పాటించనీ. ఆ ధర్మాన్ని ఆచరిస్తూనే

సంఘారామంలో ఆమె చేయగల్గిన సేవాకార్యాలు చేస్తేచాలు. నెమ్మదిగా ఆమెలో కర్మనిష్ఠలో ఉప్పొంగిన భావవీచికలు పరివ్రాజక వృత్తి స్వీకరించుటలో ఆమెను వివశురాలిని చేస్తాయి" అని తెలియచేస్తాడు. సరిగ్గా నూటికి నూరు పాళ్ళు తథాగతుడు చెప్పినట్లే జరిగింది కూడ. గృహస్థ ధర్మాన్ని స్వీకరిస్తూ పరివ్రాజకురాలైన సుమన గౌతమిని మించిన శ్రేష్ఠస్థాయికి చెందిన మహిళగా కీర్తించబడింది. **పరిపక్వస్థితి వచ్చేసరికి వ్యక్తిని దారిమళ్ళించగల ఆలోచనలు వాటంతట అవే వస్తాయి.**

**కథ 22 :** ఈశ్వర భక్తికి సరియైన నిర్వచనం మానవునికి అవగతమవ్వాలంటే క్రమంగా ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ పయనించటం వల్లనే సాధ్యమవుతుంది. శ్రమను, కర్మను, అవహేళన చేసే వారికి, అనవసరం అని భావించేవారికి "భక్తి"అనే పేరు ఎత్తటానికి అర్హతలేదు.

అశ్వ ఘోషుడు విసుగుచెంది విరాగియై ఆలుబిడ్డలను వదలి ఈశ్వర దర్శనంకోసం తపిస్తూ తిరుగసాగేడు. తిరిగి తిరిగి చివరకు ఆకలి బాధ తాళలేక ఒక వ్యవసాయదారుని ఇంటిముందు నిలబడతాడు. ఎంతో శాంతితో, ఆనందంతో, తన పనిలో నిమగ్నమైయున్న వ్యవసాయదారుని చూచి, ఓ సోదరుడా! ఈ నీ ప్రసన్నతకు ఆనందానికి కారణం ఏమిటో ? చెప్పుమంటాడు. వ్యవసాయదారుడు "ఈశ్వరదర్శనం" అని బదులు పల్కుతాడు. అశ్వఘోషుడు తనకు కూడా ఆ భాగ్యాన్ని ప్రసాదించుమని వేడుకొంటాడు. వ్యవసాయదారుడు 'సరే'నని వంటచేసి వండినదానిలో సగం అశ్వఘోషునికి తినిపించి సగం తాను తిని తన పనిలో తాను నిమగ్నమవుతాడు. అనేక దినాలుగా తిండిలేక లభించిన భోజనం, ప్రశాంతమైన వాతావరణంలో అశ్వఘోషుడు ఒడలు మరచి నిద్రపోతాడు. అలసట, అశాంతి దూరమై ఆ నిద్ర అతనికి గతంలో ఎన్నడూ ఎరుగనంత శాంతిని, ఆనందాన్ని ప్రసాదించింది. వ్యవసాయదారుడు చెప్పిన ఈశ్వరదర్శనం లభించినట్లే అనిపించింది.

**కర్మను ఎగవెయ్యటం వల్లకాక కర్మ ఫలం పట్ల ఆసక్తిలేకుండా ఆచరించటం వల్లనే ఈశ్వర సాక్షాత్కారం లభిస్తుందని** అశ్వఘోషుడు అనుభవ పూర్వకంగా తెలుసుకొంటాడు.

**కథ 23 :** తపోసంపన్నుడైన ముద్గలమహర్షి కురుక్షేత్ర ధర్మ భూమిలో నివసించేవాడు. నెలలోని మొదటి పక్షం వనంనుండి ఆహారధాన్యాలను సేకరించటంలో నిమగ్నమయ్యేవాడు. నెలలోని రెండవ పక్షం సేకరించిన వాటినన్నింటినీ యజ్ఞకర్మకు, అతిథి సత్కారానికి ఖర్చుచేసేవాడు. ఋషి శ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు, మహర్షిని పరీక్షించదలచి అనేక పర్యాయములు వేల సంఖ్యలో శిష్యులను వెంట పెట్టుకొని ముద్గలమహర్షి ఆశ్రమానికి వచ్చేవాడు. ప్రతీసారి మహర్షి విశ్వామిత్రుని తన ఆతిథ్యంతో ఆనందపారవశ్యంలో ముంచేవాడు. ఈ రెండు పక్షాలకు మహర్షి ఆచరిస్తున్న కర్మకు మధ్యగల యోగపరమైన సంబంధమే ఇంతటి ఆశ్చర్యకరమైన ఫలితాలను ఇస్తున్నట్లు విశ్వామిత్రుడు గుర్తించి పూర్ణ పురుషుడైన నీకు స్వర్గసుఖాలు లభించుగాక అని వరమిస్తాడు. వెంటనే దేవదూతలు ఈయనను స్వర్గానికి రమ్మంటూ ఆశ్రమం ముంగిట నిలబడతారు. కానీ ముద్గలుడు వారిని వారిస్తూ, "దేవదూతలారా! నన్ను ఇబ్బంది పెట్టకండి. కర్మకు తావేలేని దేవలోకానికి వచ్చి సుఖాలు అనుభవించటం తప్ప నేను చేసేది ఏమున్నది? కాబట్టి కర్మాచరణ గావిస్తూ నా ప్రియమైన కర్మభూమిలోనే జీవిస్తానని" తెలియచేస్తాడు.

**కథ 24 :** జ్ఞానార్జనానంతరం కర్మభూమిలో కాలుమోపటం భారతభూమి యొక్క ఆర్ష సాంప్రదాయం. ప్రౌఢస్థితికి చేరేసరికి లోపలనుండి భక్తిభావనలు ఉప్పొంగుతాయి. పరివ్రాజక ధర్మాన్ని ఆచరించకుండా జీవింపజాలమంటూ ప్రజలే ఇల్లువదలి బయలుదేరుతారు. ఎప్పుడు ఏ పరిస్థితులు ఎదురైతే వాటికి తగినట్లే మహామానవులు జనసముదాయాలకు దారిచూపుతూ ఉంటారు.

శృంగారరసం భక్తియొక్క రూపాన్నే వికృతంగా మార్చివేసి దాని ప్రభావాన్ని జనసముదాయాలపై అసహ్యంగా ముద్రించటం చైతన్య మహాప్రభువుని కలచివేసింది. లక్ష్యప్రాప్తికి బదులు కుటిల మనోరంజకాన్ని కల్గించే సాధనంగా భక్తిని మార్చివేయటం ఆయన సహించలేకపోయాడు. బెంగాల్ నుండి బృందావనం వరకూ పాదయాత్ర చేస్తూ భక్తియొక్క పవిత్ర ప్రవాహధారలను ఇంటింటికి ప్రవహింపచేశాడు. శుష్క హృదయాలలోని శూన్య స్థితిని తొలగించివేసి కర్మను ఆచరిస్తూనే భక్తి మార్గాన్ని ఆశ్రయించండని వ్యక్తి వ్యక్తికి పిలుపునిచ్చాడు. వికృతమైన ఆచారాలను సాంప్రదాయాలను ఖండించి బృందావనంలో నెలవైయున్న తన భగవానుడైన కృష్ణయ్య జీవితగాథను ప్రేరణాత్మకంగా మలచి కృష్ణుడు లీలలు చూపిన స్థానాలలో జీవంపోసి వాటిని తీర్థాలుగా మార్చివేశాడు. **జీవితంలో భక్తియొక్క సమన్వయం అనేది అవతార శక్తియొక్క విశిష్టత.**

**కథ 25 :** బాలగంగాధరతిలక్ స్వాతంత్ర్య సంగ్రామ సేనాని. జీవన పర్యంతం కర్మాచరణపట్లే పరిపూర్ణ విశ్వాసాన్ని చూపిన ఈ మహాయోధుడు జైలుగోడల మధ్య గీతారహస్యాన్ని వెల్లడించాడు. జ్ఞానం, భక్తియొక్క సమన్వయం ఇంతటి గొప్ప సమీక్షాయుత వివేచనను ప్రతికూల పరిస్థితులలో జైలుగోడల మధ్య కూర్చొని వ్రాయటం అనేది ఆయన అంతరంగ పరిపక్వత యొక్క నిదర్శనం.

**శ్లో॥ ప్రేమాదర్శాన్ ప్రతీర్థం తానున్నేతుం చాప్యనున్నతాన్ ।**
**వర్ధమాన జనాం శ్చాపి ప్రోత్సాహ ఇతు మజ్జసా ॥**
**సహజాయా సముత్కంఠ తత్ర భక్తే మనోరమా ।**
**సుషమా దృశ్యతే దివ్య విశాలంచ మహామునే ॥**

ఆదర్శాలపట్ల ప్రేమ, అట్టడుగున ఉన్నవారిని పైకితీసుకొని రావటం, ముందుకు పోగలవారిని మరికాస్త ముందు కురికేలా ప్రోత్సహించటం ఈ కర్మల పట్లగల ఉత్కంఠలోనే భక్తియొక్క కాంతిదృష్టి గోచరమవుతుంది. ఆ వెలుగు దివ్యమై, భవ్యమై విస్తృతమై వ్యాపించిఉంటుంది.

**భక్తి అంటే అర్థం శ్రేష్ఠమైన వాటిపట్ల గాఢమైన మైత్రి. అంతేగాక భక్తి ఎల్లవేళాలా ఒక విశిష్టమైన ఉద్దేశ్యాన్ని కల్గివుంటుంది. దైవత్వం వలెనే ఆత్మ విస్తరణా భావనలు నిండి వుంటాయి. నిజమైన భక్తుడు తనకంటే క్రిందనున్న వారిని పైకి తీసికొని రాకుండా తన ఔన్నత్యం గూర్చిగాని, ప్రగతిగూర్చి గాని ఆలోచనలను దరిచేరనీయడు.**

**భక్తి అంటే పారవశ్యం చెంది స్మరణచేయటం మాత్రంగాదు. తన అంతరంగంలో ఉప్పొంగే కరుణతోను, శ్రద్ధతోను అసంఖ్యాకులైన సాటి వ్యక్తులను ప్రాణవంతులను చేయటమే భక్తికి నిర్వచనం.**

**కథ 26 :** మదనమోహన మాళవీయ ముఖ్యమైన పని ఉండి ఒక బ్రిటీష్ అధికారిని కలవాలని వెళ్తూ ఉండగా దారిలో ఒక అసహాయురాలైన పేద స్త్రీ పాదంలో బలమైన గాయంతో భరించరాని బాధను

అనుభవిస్తూ పడిఉండటం చూస్తాడు. ఆయన తన గుఱ్ఱపు బండి దిగి ఆమెను లేవనెత్తి తన బండిలో ఎక్కించుకొని ఆస్పత్రికి బయలుదేరుతూ ఉండగా కొందరు వ్యక్తులు వారిస్తూ, అయ్యా! ఈ చిన్న పనికోసం మీ విలువైన కాలాన్ని వృధా చేయకండి. ఈ పని మేము చేస్తామని ముందుకువస్తారు. కానీ మాళవీయజీ వారికి ఆ అవకాశాన్ని ఈయక "నా కాలం కంటే కూడా అత్యంత విలువైనది ఈపనే. కాబట్టి, నేనే స్వయంగా ఈమె బాగోగులు చూస్తాను." అంటూ వాత్సల్యంగా కన్నబిడ్డకి శుశ్రూష చేసినంత ప్రేమగా ఆమెకు సేవను, సదుపాయాన్ని కలుగచేస్తాడు.

**కథ 27 :** **తీ**ర్థయాత్రకు బయలుదేరిన ఇద్దరు సోదరులవద్ద పుష్కలంగా ధనం ఉంది. ఒక సోదరుడు తనవద్ద కల ధనాన్ని ప్రతి యాచకునికి అవసరం, అనవసరం; పాత్రత, అపాత్రత వంటి విచక్షణగాని, ఆలోచనగానీ చేయకుండా యాంత్రికంగా ధర్మం చేయసాగాడు. యాత్ర కొంత దూరం సాగిన తర్వాత దారిలో నిర్ధనుడైన ఒక గృహస్థుడు చలితో వణుకుతూ తమ ముందునుండి పోవటం రెండవ సోదరుడు చూస్తాడు. వెంటనే తన కోటు విప్పి ఆయనకిస్తూ, సోదరుడా! నీ కుటుంబం మొత్తం నీపైన ఆధారపడిఉంది. చలి బారినుండి వెంటనే శరీరాన్ని కాపాడుకోమని అంటాడు. తీర్థయాత్ర యొక్క ఉద్దేశ్యాన్ని, లక్ష్యాన్ని చక్కగా అవగతం చేసికొని ఆచరణలో పెట్టిన తన సోదరునిచూచి మొదటి సోదరుడు సిగ్గుతో శిరస్సు వంచుకొంటాడు. దానం, భక్తి వీటికి అసలైన అర్థం ఇతరుల బాధను తనదిగా భావించి ఆపదలో ఆదుకోవటమే అన్న తథ్యాన్ని తెలిసికొంటాడు.

**కథ 28 :** సిద్ధార్థుడు, దేవదత్తుడు కలసి తోటలో విహరిస్తూండగా అందమైన రెండు రాజహంసలు ఆకాశంలో ఎగరటం చూసి అత్యంత ఆనందభరితుడై సిద్ధార్థుడు దేవదత్తుని కూడా చూడుమంటాడు. అతడు వెంటనే బాణాన్ని తీసి ఒక హంసను కొట్టగా అది నేల కూలింది. ఆనందాన్ని దుఃఖంగా మార్చివేసింది. రక్తంలో తడిసి కొట్టుకొంటున్న రాజహంసను సిద్ధార్థుడు ఒడిలో పెట్టుకొని ప్రేమతో సేవచేసి రక్షిస్తాడు. అయినా దేవదత్తుడు హంస తనదని తనకివ్వమంటాడు. సిద్ధార్థుడు నిరాకరిస్తాడు. విషయం రాజదర్బారుకి చేరింది. చంపినవాని కంటె రక్షించినవాడు గొప్పవాడని రాజు తీర్పు చెబుతాడు. బాల్యంలో నాటుకొన్న ఈ భావబీజాలు మొలకెత్తి మహావృక్షంగా ఆత్మ విస్తరణ రూపాన్ని ధరించి వ్యక్తిని విశ్వమానవునిగా మార్చివేశాయి.

**కథ 29 :** **మ**రాఠీ దినపత్రిక సంపాదకులు, ప్రసిద్ధి చెందిన సాహితీవేత్త ఆచార్య ప్రహ్లాద కేశవ అత్రి తన జీవిత మంతా శ్రమించి, ఆర్జించిన 50 లక్షల సంపదను భారత ప్రజలకు వీలునామా వ్రాస్తాడు. తన వారసులైనప్పటికీ స్వయంగా ఆర్జించుకోగల శక్తి ఉన్న వ్యక్తులెవ్వరికీ ఈ సంపదమీద అధికారం లేదని వీలునామాలో పేర్కొంటాడు. దేశమంతా తన కుటుంబమని, భారత ప్రజలు తన సోదరులని, వసుధైక కుటుంబక భావనను, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని మాటలలోకాక, చేతలలో చూపిన మహనీయుడితడు.

శ్లో॥ **స్వ శరీరే కుటుంబే చ సీమితం ప్రేమ ప్రోచ్యతే ।**
**మోహో వ్యాపకతాం యాతో భక్తి త్వేన ప్రశస్యతే ॥**
**ఉదారసేవారూపేణ సాధనా రూపకేపివ ।**
**ఉదార పరిణతి స్తస్య స్వత్వం సర్వేషువర్థతే ॥**
**నహితత్ర పరః కో ఽపి దృశ్యతే తాన్ స్వకాన్ సదా ।**

**వీర కృత్యాల పరిమళమే కీర్తి.**

**సుసంస్కృతాంశ్చ సుఖినః కర్తుం మాకులతోచితా ॥**
**భక్తేషు మనుజేష్వేవ మాకులత్వం తు దృశ్యతే ।**
**గ్రహీతుం విస్మరంతస్తే దాతుమేవ స్మరంతిహి ॥**

**వ్యక్తికి కుటుంబానికే పరిమితమైన ప్రేమ 'మోహం'గా పేర్కొనబడింది. అదే ప్రేమ విశ్వవ్యాపకత్వం చెందినపుడు 'భక్తి'గా కీర్తించబడుతోంది.** సేవ, సాధనా రూపంలో ప్రేమ పరిణతి చెందినపుడు వ్యక్తికి అందరూ తనవారుగా దృష్టి గోచరమవుతారు.

తన వారిని సంస్కరించాలని, సుఖపెట్టాలనే ఆరాటం సహజంగా ప్రతి వ్యక్తికి ఉంటుంది. పరమార్ధపరమైన వ్యాకులత కేవలం భక్తజనులలోనే పొంగిప్రవహిస్తూ ఉంటుంది. **స్వీకరించటం** అనే పదాన్ని వీరు పూర్తిగా మరచి ఎల్లవేళలా ఏదో రూపంలో ఎవరికి ఏమివ్వగలనాయని ఆరాటపడుతూ ఉంటారు. భక్తజనుల లక్షణం ఇది.

కుటుంబం అనే పరికరంతో ఆరంభమైన ప్రేమ విశ్వకుటుంబం వరకూ విస్తరించని నాడు ఆ ప్రేమకు, ఆ కుటుంబాలకు అర్థం లేదు. ఇంక కుటుంబాలనే ప్రేమించి సేవించలేని వ్యక్తులు సమాజాన్ని ఏదో ఉద్ధరిస్తారని ఆశించటం వెర్రితనమే అవుతుంది.

**కథ 30 : ఒ**క మహిళ ఒక మహాత్ముని వద్దకు వచ్చి, "స్వామీ! మీరు భగవంతునితో యేనాడూ వేరుపడిలేనని చెబుతూ ఉంటారు. ఆ మాటలు నాకెంతో ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. ఎందుకంటే ఎంతో కాలంగా దైవాన్ని పూజిస్తున్న పరమ భక్తురాలు నా తల్లి. ఆమెకు దైవం కనీసం స్వప్నంలోనైనా కానరాలేదు. మీ ఇద్దరిమధ్య వ్యత్యాసం ఏమిటని" ప్రశ్నిస్తుంది. మహాత్ముడు మందహాసంచేసి, ధ్యానములో దైవాన్ని అడిగి నీకు జవాబు రేపు చెబుతానని అంటాడు. మర్నాడు మహిళ నుద్దేశించి, "అమ్మా! నీ తల్లి తన బిడ్డలందరిపట్ల ప్రేమతోను, సమభావంతోను ప్రవర్తించక అహంకారంతోను, పక్షపాతం తోను ప్రవర్తిస్తూ ఉంటుంది. అందుకే పరమాత్ముడు ఆమెను కలవడం ఇష్టంలేదని నీ ప్రశ్నకు బదులు పల్కుతున్నాడు". భగవంతుని అభిమతాన్ని తెలుసుకొన్న ఆ తల్లి **పూజలకంటే** ప్రవర్తన **మృదువుగా, మధురంగా ఉండటం వల్లనే భగవంతుడు** ప్రసన్ను**డౌతాడని** తెలుసుకొని తన ప్రవర్తనను మార్చుకొంటుంది.

**కథ 31 : అ**రణ్యవాస సమయంలో దప్పిగొన్న పాండవులు చెరువువద్దకు ఒక్కొక్కరుగా వెళ్ళి యక్షుని ప్రశ్నలకు సమాధానం చెప్పలేక అక్కడే మూర్ఛపోతారు. చివరగా వచ్చిన యుధిష్ఠిరుడు యక్షుని ప్రశ్నలన్నింటికీ అమూల్యమైన సమాధానాలనిచ్చి అతని ఆనందపరవశుణ్ణి చేస్తాడు. ప్రసన్నుడై యక్షుడు కోరుకోమన్న వరానికి మాద్రి కుమారుడైన నకులుని జీవింపచేయుమని, తన తల్లి కుంతికి తాను ఉన్నట్లే మాద్రికి కూడా ఒక పుత్రుడు ఉండితీరాలని యుధిష్ఠిరుడు కోరిన కోర్కె యక్షుణ్ణి ఆనందపరవశుణ్ణి చేసింది. నలుగురు సోదరులను జీవింపచేసి ధర్మరాజు యొక్క ధర్మాన్ని రక్షిస్తాడు.

**కథ 32 : "వి**శ్వమానవత గొంతెత్తి పిలిచేటప్పుడు మహాపురుషులు, జీవాత్మలను సంసార పరమైన కోర్కెలు, వ్యామోహాలలో బంధించే మాయనుండి రక్షించటానికి దిగి వస్తూఉంటారు. వీరు తమ ప్రగతి పథాన్ని తమకు తామే నిర్మించుకొంటూ ఉంటారు".

**ప్రేమ కళ్లతో కాక హృదయంతో చూస్తుంది. కనుకనే, ప్రేమ గుడ్డిది.**

ఆదిశంకరాచార్యకు బాల్యంనుండి ధర్మానికి సంస్కృతికి సేవచెయ్యాలనే కోర్కెఉండేది కానీ సన్యాసాశ్రమాన్ని స్వీకరించటానికి తల్లి అంగీకరించలేదు. ఉన్నత లక్ష్యాలను నెరవేర్చాలంటే మమకారాలను విడనాడక తప్పదని భావించిన బాలశంకరుడు ఒకనాడు నదిలో స్నానం చేస్తూ "ఆపదలో ఉన్నాను రక్షించుమని" కేకలు వేస్తాడు. కలత చెందుతున్న తల్లితో, అమ్మా! నన్ను రక్షించాలను కొంటే శంకరునికి ఒప్పగించు. ఆయనను మించిన రక్షకుడు ఎవ్వరూలేరు అని తెలియజేస్తాడు. కుమారుని మరణం కంటె సన్యాసం మేలని భావించిన తల్లి శంకరునికే సమర్పిస్తుంది. అలాగే శంకరుడు కూడా తల్లి ప్రేమ కంటె లోకకల్యాణం మహత్తరమైనది అని గుర్తించటం వలన దేశంలో నలుమూలలా సద్జ్ఞానజ్యోతుల్ని వెలిగించాడు. తల్లికి ఇచ్చిన మాటప్రకారం ఆశ్రమ నియమాలను అధిగమించి స్వయంగా ఆమె దహన సంస్కారాలను కూడా ఆచరిస్తాడు.

**కథ 33 : వి**శ్వఉద్యానవనాన్ని ఉన్నతంగా తీర్చి దిద్దాలనిపించే ఔదార్యం హృదయంలో ఉత్పన్నమైతే భక్తి భావనలు అంతరంగంలో ఉదయించినట్లు గుర్తించాలి. ఇటువంటి భక్తజనులు ఇతరులను ప్రసన్నంగాను, సంస్కార వంతులుగాను దర్శించాలని నిరంతరం ఆరాటపడుతూ ఉంటారు.

ఫ్రాన్సిస్ అనే సన్యాసి ఒక కుష్ఠురోగి చికిత్సకు ధనాన్నిచ్చి అనేక విధాలుగా సేవలుచేస్తాడు. ఈ విధమైన ప్రవర్తనలు తండ్రికి నచ్చక కుమారుని దండించి తన సంపదకు ఉత్తరాధికారం నుండి బహిష్కరిస్తానని హెచ్చరిస్తాడు. తండ్రి బెదిరింపునకు ఏమాత్రం చలించక ఒక భారమైన బంధనం నుండి విముక్తి ప్రసాదించిన తండ్రికి ధన్యవాదాలు తెలియచేస్తూ తండ్రి ద్వారా ఇంతవరకూ లభించిన వస్త్రాలను, ఇతర సౌకర్యాలను కూడా వదిలివేసి ఇల్లువదలి వెళ్ళిపోతాడు. కాలాంతరంలో క్రీస్తు ధర్మాన్ని ప్రచారంచేయటంలో ఆయన చేసిన కృషి, త్యాగం ఎంతటివో అందరకూ తెలిసినదే.

**కథ 34 : ఒ**క సాధువు శిష్యసమేతంగా పర్యటిస్తూ ఉండగా ఒక ఊరిలో ఒక బాబా ధ్యానముద్రలో కూర్చొని జపమాల త్రిప్పుతూ అడుగడుగునా కన్నులు విప్పి అటునిటు చూస్తూ తనముందు ఎంత ధనం ప్రోగయ్యిందా, చుట్టూ ఎంతమంది జనం ప్రోగయ్యారా అని కుతూహలంగా పరిశీలిస్తూ ఉంటాడు. ఇది చూచి సాధువు చిరునవ్వు నవ్వుకొని మరికొంత దూరం పోయేసరికి ఒక పండితుడు భాగవత పారాయణం చేస్తూ ప్రజలముందు కూర్చొని ఉంటాడు. ఆయన ముఖంలోని హావ భావాలు యాంత్రికంగా మారుతున్నాయేగాని భావన, అనుభూతి యేమాత్రం లేవు. సాధువు బాధగా నవ్వుకొని మరికాస్త ముందుకి పోయేసరికి ఒక వ్యక్తి ఒక రోగి గాయాలను కడిగి శుభ్రంచేస్తూ కట్టుకట్టి ప్రేమనిండిన స్వరంతో ఆ రోగికి ధైర్య వచనాలు చెపుతున్నాడు. సాధువు కన్నులు ఆనందాశ్రువులతో నిండేయి. ఆశ్రమానికి తిరిగిరాగానే శిష్యులు సాధువుకి నమస్కరించి, స్వామీ! మొదటి రెండు ప్రదేశాలలోనూ నవ్వటానికి, మూడవ ప్రదేశంలో కన్నీళ్ళు నింపటానికి కారణం యేమిటని ప్రశ్నిస్తారు. నాయనలారా! మొదటి రెండు ప్రదేశాలలో దైవం పేరు చెప్పి ఆడంబరం మాత్రమే ఆచరించబడుతోంది. దైవం కోసం నిజంగా వ్యాకులత చెందుతున్నవాడు మూడవ వ్యక్తిమాత్రమే. అతని సేవాభావాన్ని చూసేసరికి నా హృదయం ద్రవించింది. **ధర్మం యొక్క నిజమైన స్వరూపాన్ని ప్రజల హృదయాలు ఎప్పటికి అవగతం చేసుకోగల్గుతాయో గదా"** అంటూ సాధువు గాఢ నిట్టూర్పు విడుస్తాడు.

**కథ 35 : గో**ముఖం నుండి ప్రవహించ నారంభించినపుడు గంగ సంకీర్ణమైన ధారగానే ఉంది. తరువాత నెమ్మదిగా మంచీ చెడులను కలుపుకుంటూ భూమియొక్క సంపదను అభిశించనం కావించాలని,

**శత్రుత్వాన్ని నిర్మూలించే ఉపాయం - ప్రేమ.**

ఆరాటంతో నిరంతరం ముందుకి ప్రవహించటం వల్ల సంకీర్ణమైన ఆధార హిమవత్ పర్వత శృంఖలాల బంధనాన్ని సహితం త్రుంచుకొని విశాలమైదానంలోకి ఉరకగల్గింది. ఆ వ్యాపకతత్వం వల్లనే సమస్త మాలిన్యాలను కడిగివేయగల సామర్థ్యాన్ని సంపాదించి సాగరంలో కలిసిపోగలిగింది.

ఇవ్వటమేగాని, పొందటం, సంగ్రహించటం తెలియని గంగ తన పారమార్థిక తత్వం వల్లనే అనంతమైన కీర్తిని, జనాదరణను పొందగల్గింది. ఈ నిశ్చలతత్వం, ఈ నిర్మలత్వం, ఈ పారమార్థిక తత్వం కల్గిఉన్న గంగవంటి వ్యక్తులలో మురుగు కాలవ వంటి వ్యక్తులు కూడా గంగలాగానే రూపాంతరం చెందుతారు.

**కథ 36 : ర**వీంద్రనాథ్ ఠాగూరు ఒక వైపు జమీందారీ బాధ్యతలు, మరొకవైపు విశ్వమానవత్వం యొక్క బాధ్యత ఎట్టెదుట నిలబడి ఉండగా, విశ్వమానవత్వ బాధ్యతనే భుజస్కంధాల పైన వేసుకుంటాడు. పరాధీనమైయున్న సమాజాన్ని తన భావపూరిత రచనలద్వారా ఉత్తేజ పరచి, కర్తవ్య పథంలోకి లాక్కొనివచ్చి నిలబెడతాడు. బంకించంద్ర ద్వారా ప్రజలకు అందించబడిన **ఆనందమఠం, వందేమాతరం** రవీంద్రుని ద్వారా జరిగిన ఏర్పాట్లే. ఆనాడు ప్లేగు వ్యాధి వ్యాపించినా, భయంకర పరిస్థితులలో సహచరుల సమేతంగా సమాజాన్ని సేవించిన సేవామూర్తి. ఏదో చిన్న కళాక్షేత్రంగా ప్రారంభమైన శాంతినికేతనం చివరకు విశ్వవిద్యాలయ స్వరూపాన్ని ధరించి తన నామాన్ని సార్థకం చేసుకోవటానికి నూటికి నూరుపాళ్ళు కారణభూతుడు – రవీంద్రనాథ్ ఠాగూరు.

**కథ 37 : దీ**నబంధు ఏంద్రూజ సి.ఎఫ్.ఆంద్రూస్ మొదట్లో ఆంగ్లేయుడు. గాంధీతో కలసినపుడు అంతరంగంలోకి ఆత్మీయత విశ్వమానవ గాంధీతో కలిసి సమైక్యమొందింది. ఆ తరువాత ఈయన భారత స్వాతంత్ర్యంకోసం భారతీయుల కంటె గూడా ఎక్కువ వ్యాకులత చెందేవారు. దీనబంధు అనే పేరు కూడా ఆయనకు బాపూ పెట్టినదే. ఈ విశ్వమంతా నాకుటుంబమే అయినపుడు నేను ఇంగ్లీషువాడినైనంత మాత్రాన దేశం, జాతి, రాష్ట్రం అంటూ సంకుచితమైన బంధనాలలో ఎందుకు ఇరుక్కోవాలని తనవారి ఎదుట నిలబడి ప్రశ్నించాడు.

శ్లో॥ **దాతుం సర్వస్య మర్త్యస్య సన్త్యేవ సమయః శ్రమః ।**
**చింతనం కౌశలం శౌర్యం పరామర్శస్తథాపి చ ॥**
**అతిరిక్త మతః స్వస్యోపార్జనం సంచయ స్తథా ।**
**ఆంశికస్తు భవత్యేవ పార్శ్వే సర్వస్య నిశ్చితమ్ ॥**

ఇతరులకు పంచటానికి, ఇవ్వటానికి ప్రతి వ్యక్తి వద్ద సమయం, శ్రమ, ఆలోచన, కౌశలం, ప్రతిభ, పరామర్శ మొ॥ అనేక దైవదత్తమైన శక్తులున్నాయి. ఇవికాక సంపద, ఆర్జన, విద్య మొ॥ అనేక సంపదలు తప్పకుండా ఎంతోకొంత ప్రతి వ్యక్తివద్ద ఉంటాయి. **సదాశయం అనేది ఉండాలేగానీ ఇవ్వటానికి కేవలం ధన సంపదే ఉండాలి** అని అనుకోనవసరం లేదు. తరిగిపోని విభూతులతో నిండిన అక్షయ బండారం ప్రతి వ్యక్తి అంతరంగంలోనూ ఉండనే ఉన్నది. పరమార్థ ప్రయోజనంకోసం ఎవరైనా తమ శ్రమను దానం చెయ్యాలనుకుంటే సమిష్టి శ్రమవల్ల అశుభ్రతను నిర్మూలించవచ్చు. అశక్తులకు, అసమర్థులకు వ్యక్తిగత సహాయాన్ని అందించవచ్చు. వసతికోసం భవనాలు నిర్మించవచ్చు. అలాగే సమయ సంపద నుపయోగించి సత్ప్రవృత్తుల పుణ్యప్రచారం, నిరక్షరాస్యతా నిర్మూలన వంటి పుణ్యకర్మలు ఆచరించవచ్చు. ఇంక ఆలోచనలతో

అత్యంత ప్రధానమైన సేవ, సాహిత్య సేవ చెయ్యటం అత్యంత పారమార్థికమైనది. ఆలోచనా క్రాంతి ద్వారా వ్యక్తుల జీవితలను విశిష్ట మార్గాల వైపు దారి మళ్ళించవచ్చు. అలాగే శ్రవణ కుమారునివలె సత్సాహిత్య రూపమైన అధ్యాత్మ మాతా పితరులను భుజస్కంధాలపై మోస్తూ వ్యక్తి వ్యక్తి వద్దకూ చేర్చి ఆ సాహిత్యం ద్వారా సమాజంలోని ఆలోచనలలో మార్పు తీసికొనిరావచ్చు. కౌశలం అనేది శిల్పివద్ద, చిత్రకారుని వద్ద, వైద్యునివద్ద చాలామంది దగ్గర ఉంటుంది. కానీ కౌశలం, జ్ఞానం తనకు ఈశ్వరుడిచ్చిన కానుకగా భావించి దానిని పంచటం ప్రారంభించిననాడే వ్యక్తి సృజనాత్మక గతి విధుల రూపంలో పారమార్థిక కార్యక్రమాలను అవలీలగా ఆచరించగలడు. బొత్తిగా ఇవ్వటానికి నావద్ద యేమీలేవు అని అనిపించే వారివద్ద గూడ తప్పని సరిగా ఏదో ఒకటి ఉండి తీరుతుంది. ఉదాహరణకు సత్పరామర్శనే తీసుకోండి. **దానిలో అత్యంత అద్భుతమైన శక్తి దాగియున్నది. దారిమరచిన, దారి మళ్ళిన వ్యక్తికి తన అనుభవంతో సరియైన మార్గదర్శనాన్ని చేసి సన్మార్గం వెంట నడవడానికి ప్రేరణనివ్వటం అనేది ఒక జీవితాన్ని దానం చేసినంత పుణ్యప్రదమైనది.** ఇంతకు మించిన విశిష్టమైన దానం మరి ఒకటిలేదు. గాంధీజీ వ్యక్తిత్వ ప్రభావంతో ఆ వృక్షచ్ఛాయలోనే **చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ, జమన్‌లాల్ బజాజ్, విధాన్‌చంద్రరాయ్, సుభాష్ చంద్రబోస్, వల్లభాయి పటేల్, మౌలానా ఆజాద్** వంటి వ్యక్తులు ప్రభవించారు. వీరిలో అందరూ ఆర్థిక సంపన్నులుగారు. కానీ వీరి బుద్ధి కుశలత, ఆలోచనాసామర్థ్యం, విశిష్ట వ్యక్తిత్వం వీరిద్వారా అనంతమైన రాష్ట్రసేవను చేయించాయి.

బంకించంద్ర, రవీంద్రనాథ్ ఠాగూర్ సాహిత్యం ద్వారాను, రాజర్షి ఠండన్ తన ప్రతిభాకౌశలం ద్వారానూ, వినోభాభావే శ్రమను జాగృతం చేసే ప్రవృత్తి ద్వారానూ, కేశవదాస్ సత్ పరామర్శ ద్వారానూ, స్వామి శ్రద్ధానంద్ సంస్కృతి ఉద్ధరణకు సమయాన్ని, ఆలోచనను వెచ్చించుట ద్వారానూ ఈ విధంగా వీరు చేసిన సమాజ సేవను జాతి ఎన్నటికీ మరువలేనిది. ఈ సందర్భంగా ఎక్కడా 'ధనం' అనే పదం ఉపయోగించబడలేదు.

**ఇటువంటి విశిష్టయోగ్యతలు కల వ్యక్తులు ఈనాడుకూడా సమాజంలో అధిక సంఖ్యలోనే ఉన్నారు. కానీ వీరు తమ యోగ్యతలను కేవలం వ్యక్తిగత లాభం, కుటుంబ లాభం కొరకే వినియోగిస్తూ సేకరణకు, ఆర్జనకే పరిమితం చేయటంవల్ల** సమాజంలో విపత్కర పరిస్థితులు ఉత్పన్నమవుతున్నాయి.

వైద్యుడు తన విద్యను కేవలం డబ్బుకోసమే ఉపయోగిస్తూ, దైవం ద్వారా లభించిన "కాలం"లో కొంత భాగాన్నైనా నిస్వార్థ సేవకోసం వెచ్చించని పక్షంలో వారి సామర్థ్యం దురుపయోగం చేసినట్లే అవుతోంది. ఇదేవిధంగా కళలు, సాహిత్యం, విజ్ఞానం, రాజనీతి ఒకటేమిటి అన్ని కేంద్రాలలోను దురుపయోగమే విచ్చలవిడిగా రాజ్యంచేస్తోంది. **"విశిష్టశక్తుల సదుపయోగం" అనబడే ప్రకాశం బొత్తిగా కరువైతే అంధకారమే దశదిశలా వ్యాపించక తప్పదు. కాబట్టి "యోగ్యతల సదుపయోగం"తో ప్రకాశవంతమైన భావాలు మేల్కొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దీనినే "ఉదార భక్తి భావన" అంటారు.** ఈ భావనే వ్యక్తిని విరాట్ స్వరూపమైన సమాజంతో ముడివేసి సమాజ ఋణం తీర్చుకోవటానికి అవకాశాన్ని ప్రసాదిస్తోంది.

**శ్లో॥ సంకీర్ణయాంతు స్వార్థస్య పరతాయాం నియంత్రణే ।**
**జాతే న్యూనతమే తేషాం నిర్వాహక్రమ ఉచ్చరేత్ ॥**

**పూజ, ఉపాసనలు ఆత్మబలాన్ని పెంచే ఆధ్యాత్మిక వ్యాయామాలు.**

**సురక్షితో నిధిః పార్శ్వే స ఇయాన్ కర్మయోగినః ।**
**చరితార్థయితుం భక్తేర్భావనాం పారమార్థికే ॥**
**ప్రయోజనే అనుదానాని ప్రస్తూయా చ్ఛలాఢ్య కానిహి ।**
**కృపణేషుహి దారిద్ర్యం కృత స్థానంతు దృశ్యతే ॥**

"భక్తి" అనేది అంతరంగంలోనే పరిమితమై దాగి ఉండేది కాదు. సత్కర్మ రూపంలో బయటకు పొంగి ప్రవహించి సర్వత్రా వ్యాపించి సార్థకమవని నాడు వ్యక్తి యొక్క భక్తికి అర్థం-పరమార్థం లేవు. ఔదార్యం కల హృదయం ప్రతికూల పరిస్థితులలో కూడా పరమార్థం కోసం వ్యాకులత చెందుతూ ఆత్రత పడుతుంది. వ్యక్తి తనలోని స్వార్థభావనను అంకుశంతో సంహరించలేక ఔదార్యం కరువైననాడు, పరమార్థ పరాయణత్వం లోపించిననాడు "కుబేరుని ఖజానా" ఉన్నప్పటికీ వ్యర్థమే. "దారిద్ర్యం" అనేది ఔదార్యం లేనపుడు అనుభవించేదిగానీ సంపద ధనం లేనంత మాత్రాన అనుభవించలసినది కాదు. కానీ సమాజం కేవలం డబ్బులేని వారిని మాత్రమే దరిద్రులనీ, పేదవారనీ అంటుంది. ఔదార్యం, పరమార్థ పరాయణత్వం అనేవి మనిషిలో ఉండాలేగానీ తనవద్ద ఏది ఉంటే దానినే సమాజ కల్యాణానికి ఖర్చు చేయవచ్చు.

**కథ 38 :** కృష్ణపరమాత్మ ఒకనాడు కర్ణుని ఔదార్యం గురించి కీర్తిస్తూ ఉంటాడు. అర్జునుడు ఆ మాటను అంగీకరించక, ధర్మరాజు కంటే కర్ణుడు ఉదారుడు ఎంతమాత్రం కాదని వాదిస్తాడు. కృష్ణుడు అర్జునుని ముందు కర్ణుని ఔదార్యాన్ని ఋజువు పరచాలని నిర్ణయించి, ఒక వృద్ధ బ్రాహ్మణ వేషాన్ని ధరించి ముందుగా ధర్మరాజువద్దకు వస్తాడు. యజ్ఞ కర్మ నిమిత్తం బాగా ఎండిన కట్టెలు కావాలని అడుగుతాడు. ముమ్మరంగా కురుస్తున్న వర్షాల కారణంగా ఎంతగా ప్రయత్నించినా ధర్మరాజు ఎండు కట్టెలు సంపాదించ లేకపోతాడు. తన అసమర్థతను తెలియజేస్తాడు. తరువాత కృష్ణుడు కర్ణుని వద్దకు వెళ్ళి యజ్ఞకర్మకు ఎండు కట్టెలు ప్రసాదించుమంటాడు. వర్షాలు కారణంగా ఎండుకట్టెలు బయట లభించటం దుర్లభం అని గ్రహించిన కర్ణుడు వెంటనే తన ఇంటికి ఉన్న కిటికీలు, ద్వారబంధాలు కూలగొట్టి బ్రాహ్మణునికి ఎండు కట్టెలు సమర్పిస్తాడు. చరిత్రలో కర్ణుని ఔదార్యం చిరస్థాయిగా నిలవటానికి ఇది ఒక చిన్న సంఘటన మాత్రమేనని శ్రీకృష్ణుడు అర్జునునికి ఎరుకపరుస్తాడు.

**కథ 39 :** ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఆదాయం ఎక్కువగా ఉన్నప్పటికీ ఆయన తన కంటూ ఏదీ దాచుకొనేవాడుకాదు. ఆర్జించిన మొత్తం పేదలకు, అవసరంలో ఉన్నవారికి పూర్తిగా పంచి ఇచ్చేవాడు. ఎందుకంటే ప్రజలకు కృతజ్ఞతలు చెప్పటం, ప్రశంసించటం వంటి శ్రమ కూడా వారికి కల్గకుండా ఉండటానికి తనకేదో దాతృత్వాన్ని వారు ఆపాదించకుండా ఉండటానికి గుప్తదానం చాలా సహాయపడుతుంది అని వారు భావించేవారు.

లక్షాధికార్లు, కోటీశ్వరులుగా గొప్పగా కనుపించే ఎందరో లోలోపల భావ దారిద్ర్యంతో మ్రగ్గుతూ ఉంటారు. సంపన్నులుగా లోకంలో పొగడబడే ఇలాంటి అనేక మంది అంతరంగంలోని లేమి, సంకుచితత్వం కారణంగా ఏ మాత్రం సుఖసంతోషాలను పొందలేక అశాంతితో బ్రతుకుతూ ఉంటారు. అసలైన దరిద్రులు వీరే.

**కథ 40 :** ఒక మహనీయుడు పర్యటన చేస్తూ ఉండగా మార్గమధ్యంలో ఒక రూపాయి లభించింది. ఆసక్తి లేనివాడు, అత్యంత ఆనంద స్వరూపుడు అయిన ఆ మహనీయుడు ఆ రూపాయి తనకు అనవసరమని

**అంతఃకరణ భ్రష్టం అయినకొలదీ బుద్ధి వైభవం సంకుచితం అవుతుంది.**

భావించి ఎవరైనా పేదవాడు కనిపిస్తే ఇవ్వాలని నిశ్చయించుకొంటాడు. కానీ ఎంత వెదకినా పేదవాడు ఆయనకు లభించలేదు. రూపాయి ఏమిచేయాలోనని ఆలోచిస్తూ ఉండగా చివరకు ఒక రాజు కనుపిస్తాడు. వెంటనే మహాత్ముడు ఆ రూపాయి రాజు చేతిలో పెట్టి భారాన్ని వదిలించుకొంటాడు. కానీ పేదవాడికి ఇవ్వదలచిన రూపాయి తన చేతిలో పెట్టటంలో మహాత్ముని ఉద్దేశ్యం ఏమిటో తెల్సుకోదలచి రాజు ఆగ్రహంతో మహాత్ముని కారణం అడుగుతాడు. మహాత్ముడు శాంత గంభీర స్వరంతో రాజా! సమస్త సంపదలు కల్గిఉండి వాటిని సద్వినియోగం చేయక పరాయి సంపదకోసం సైన్యంతో దండెత్తి వెళుతున్న నీకంటే ఎక్కువ దరిద్రుడు ఇంక ఎవరూ ఉండరనిపించింది. అందుకే రూపాయి నీకు ఇవ్వవలసి వచ్చింది అని తెలియజేస్తాడు. ఆ మాటలు రాజు హృదయానికి గ్రుచ్చుకొన్నాయి. అతనిలో పరివర్తన కల్గింది. సైన్యాన్ని వెనక్కి మళ్ళిస్తాడు.

ఆనందించగల వారికి తమవద్దనున్న దైవదత్తమైన సాధనాలు పుష్కలంగా సరిపోతాయి. ఆశరూపంలో అవసరాల ఆకలికి వీరు బలికారు.

**కథ 41 : బా**గ్దాద్ చక్రవర్తి ప్రజలపై అనేక అక్రమాలు, అత్యాచారాలు జరిపి దుఃఖపెట్టి అమితమైన ధనాన్ని ప్రోగుచేస్తాడు. ఆ రాజ్యంలో వ్యాపించిన స్వార్థం కూడగట్టే ప్రవృత్తి మహాత్ముడైన గురునానక్‌కి తెలుస్తుంది. వాటి నివారణార్థం ఆయన బాగ్దాద్ పట్టణంలో ప్రవేశించి సరిగ్గా రాజభవనానికి ఎదురుగా ప్రక్కనే రాళ్ళను గుట్టగా ప్రోగుచేసి పెట్టుకొని కూర్చుంటాడు. భక్తనానక్ రాజ్యంలో ప్రవేశించిన వార్తవిని బాగ్దాద్ చక్రవర్తి ఆయన దర్శనార్థం వస్తాడు. రాళ్ళగుట్టను చూచి ఆశ్చర్యంతో ‘ఎందుకని’ ప్రశ్నిస్తాడు. దైవానికి కానుకగా ఇవ్వటానికి మరణానంతరం వీటిని నా వెంట తీసికెళతానని నానక్ బదులు పల్కుతాడు. చక్రవర్తి పకపకా నవ్వుతూ, “నీవేదో మహాత్ముడివి అనుకొన్నాను కానీ మూర్ఖుడిలా ఉన్నావే. మరణానంతరం ప్రతి జీవి తన వెంట పాపపుణ్యాలను తప్ప చిన్న సూదిని కూడా వెంట తీసికెళ్ళలేడనే సత్యం నీకు తెలీదా ?” అని అడుగుతాడు. నానక్ ఆ మాటలకు ఏమాత్రం స్పందించకుండా చక్రవర్తివంక సూటిగా చూస్తూ, రాజా! నీవు చెప్పిన సత్యం నాకు తెలియదయ్యా! ప్రజలను పీడించి, నీవు ఆర్జించే ఈ ధనం అంతా నీవు నీవెంట తీసికెళ్ళటానికే అయివుంటుందని భావించి, నీవెంట వచ్చి నాకున్నది నేను దైవానికి సమర్పించాలనే కోరికతో రాళ్ళు ఏరుకొన్నానని బదులు పల్కుతాడు.

ఆ మాటలు చక్రవర్తికి ములుకుల్లా గ్రుచ్చుకొన్నాయి. వాస్తవం ఏమిటో అర్థమైంది. ప్రజలను పీడించటం మాని, ప్రజాసేవకై తన సర్వస్వం ఖర్చుచేయ నారంభించాడు.

**కథ 42 : ఒ**క వృద్ధురాలికి సంతానం లేదు. తనకున్న సంపదను ధార్మిక కార్యాలకై వినియోగిస్తూ జీవితం గడపసాగింది. దైవం ప్రసన్నుడై ఆమె అంత్యకాలంలో దూతలను పంపి స్వర్గానికి రమ్మని కబురు పంపుతాడు.

కానీ ఆమె దైవం పంపిన ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ, ఇంకా అన్నీ చక్కబెట్టుకోలేదు. కాస్త వ్యవధి ఇవ్వమంటుంది. దూతలు సరేనని 2 సం॥లు వ్యవధి ఇస్తారు. వృద్ధురాలు తనకున్న ఇల్లు సంపద ఈ 2 సం॥ల కాలంలో సద్వినియోగం చేయటానికి బదులు కూడగట్టిన ధనాన్ని వడ్డీలకు అప్పుతెచ్చి అబద్దాలతో దొంగలెక్కలు కట్టి ఎక్కువ ఆర్జించ నారంభించింది. ఈ విధంగా ఇచ్చిన గడువు పూర్తి అయింది. కానీ ఈసారి దేవదూతలకు బదులు యమదూతలు వచ్చి వృద్ధురాల్ని యమలోకానికి లాక్కొనిపోతారు. జీవితకాలం

**మార్గం కష్టదాయకం కాకపోతే, ఆ లక్ష్యం ఉన్నతం కావడం అనుమానాస్పదమే.**

అంతా చేసిన పుణ్యఫలం 2 సంవత్సరాలు చేసిన పాపఫలంతో నశించి పోయినందుకు వృద్ధురాలు నెత్తి, నోరు మొత్తుకొంటూ నరకానికి పోయింది.

స్వామి రామతీర్థుడు "నేను ఎంతో చేశాను. కానీ ప్రతిఫలంగా లభించిన దేమిటి ?" అని ఎన్నడూ ఆలోచించకండి. విశ్వమంతా వ్యాపించి పెద్ద పెద్ద భూఖండాలను తడిపి, సస్యశ్యామలం గావించి మానవులకు అన్నరాశులను లభింప చేయటానికి నిరంతరం శ్రమించే మేఘాలు, నదులు – ఇవి మననుండి యేమి ఆశిస్తున్నాయి? వాటి శ్రమకు మనం ఏమి విలువ కట్టగలం ? అలాగే పృథ్వీమాత గుండెలో గునపాలు గ్రుచ్చి, మలమూత్రాలతో ఆమెను మలినంచేస్తూ, ఆమెపై జీవితమంతా గడుపుకుంటున్న మనం, ఆమె ఋణాన్ని యే విధంగా తీర్చుకొంటున్నాము? నీడ, ఫలాలు, కట్టెలు, సమస్త సదుపాయాలు, వృక్షాల ద్వారా అనుభవిస్తూ వాటికి మనం కట్టే విలువ యేమున్నది ? కాబట్టే, **పరోపకారం అనేది ఎవరికివారు తీర్చుకొంటున్న ఋణం మాత్రమే.** త్యాగం గూర్చి తెలియని వారికి అది అప్పుగా అనిపించవచ్చు. కానీ విలువ తెలిసిన వారికి ఈశ్వరానుగ్రహం వల్లనే పరోపకారం అనే దివ్య గుణం అత్యంత శాంతిప్రదమైనది, ఉత్కృష్టమైనది అని అనుభవమవుతుంది. పరోపకార పరాయణులైన వ్యక్తులు తాము ఇతరులకు చేసిన ఉపకారాల ద్వారా ఇతరులు పొందిన లాభానికి అనేక రెట్లు స్వయంగా తాము పొందుతున్నట్లు స్పష్టంగా తెలుపుతూ ఉంటారు" అని ఎల్లప్పుడూ చెబుతూ ఉండేవారు.

**శ్లో॥ నిరాకారః ప్రభుశ్చిత్తే నరస్యావతరత్యయమ్ ।**
**తస్యానుభూతి రుచ్చస్య స్తరస్త్యైవతు ప్రేమకే ॥**
**భవతి జ్ఞాయతే యాచ భక్తి, రూపేణ మానవైః ।**
**ఆదర్శ బద్ధమాత్మీయత్వం హి భక్తేస్తు భావనా ॥**

ఈశ్వరుడు నిరాకారుడు. **ఈశ్వరావతరణ మానవుని అంతఃకరణ నుండే జరుగుతుంది. మానవుల ద్వారా భక్తిరూపంలో తెలుసుకోబడిన ఉన్నతస్థాయికి చెందిన ప్రేమతోనే ఈశ్వరానుభూతి కల్గుతుంది. భక్తి అంటే ఉన్నత ఆదర్శాలతో మేళవింపబడిన ఆత్మీయతయే.** భక్తియొక్క ఏకాంతసాధన ఈశ్వరునికి ఆత్మ సమర్పణ గావించుకోవటానికి ఉత్పన్నమయ్యే శ్రద్ధ రూపంతో సాధ్యమవుతుంది. ఈ శ్రద్ధ క్రమంగా పరిపక్వత చెంది ఉదార ఆత్మీయతాభావనగా ప్రకటీకృతమై సర్వ వ్యాపకత్వం చెందుతుంది. **అహం అనేది త్యజించటానికి చేసే పురుషార్థం, శ్రద్ధగా,** చెప్పబడుతుంది. ఈ శ్రద్ధ వృద్ధి చెందటానికి భక్తితో చేసే ఏకాంత సాధన ప్రాథమిక స్థితి. ఇది క్రమంగా వికసించి ఈ సాధన కేవలం తనకే పరిమితం కాక దశదిశలా విస్తరించినపుడు అన్నీ అందరూ, తనవారుగానే దృష్టి గోచర మవ్వటం జరుగుతుంది. భారతదేశంలోని సాధువులు, సన్యాసులు తమకుగానీ, దేశానికిగానీ యేమాత్రం మేలు జరగని అకర్మణ్యజీవనం గడుపుతున్నారని గుర్తించిన వివేకానందుడు రామకృష్ణ మఠాలను నిర్మించటం ప్రారంభించాడు. కేవలం సేవకే అంకితమైన ఈ మఠాలవల్ల మన పూజలు, ఆత్మ కల్యాణ సాధనల లక్ష్యం నెరవేరదని, సేవ అనేది లోక సేవకులపని అని సాధువులు వివేకానందుని ప్రశ్నించినపుడు, వివేకానందుడు నమ్ర స్వరంతో, "సోదరులారా! విశ్వకల్యాణంలోనే ఆత్మకళ్యాణం ఉన్నది. అసలైన పూజ అంటే సేవే. అజ్ఞానాంధకారాన్ని నివారించటం, దరిద్ర జనులను ఆనంద పెట్టటం, రోగులకు సేవచేయటం, ఈ మూడు పనులు మనం ఆచరించినట్లయితే, హిమాలయ ఉన్నత శిఖరాలపై సంవత్సరాల తరబడి కఠోర తపస్సు ఆచరిస్తున్న తపోసంపన్నుల కంటె కూడ ముందుగా మనకు దైవం ప్రసన్నుడౌతాడు" అని తెలియచేస్తాడు.

**ఇతరులను మోసగించగోరేవాడు నిజానికి తనను తాను మోసగించుకుంటాడు.**

**కథ 43 : అ**సలైన స్వర్గాధికారం గల వ్యక్తిని ఎవరినైనా వెదకి తీసుకొని రమ్మని విధాత జయవిజయులను భూలోకానికి పంపిస్తాడు. ధార్మిక కార్యక్రమాలలో లగ్నమైయున్న అనేక మందిని జయ విజయులు భూమిపై దర్శించి. "ఇవన్నీ మీరెందుకు ఆచరిస్తున్నారని ప్రశ్నిస్తారు. "ఈ ప్రపంచం మాయ, దీనినుండి ముక్తి లభించాలి. అలాగే మాకు పాపవిమోచనం జరగాలి. అందుకే ఆచరిస్తున్నామని" వారు బదులు పల్కేరు. జయవిజయులు ముందుకు సాగుతుండగా రాత్రి కావటాన ఒక అంధుడు ఒక దీపాన్ని వెల్గించి బాటసారులకు వెలుగు చూపటంకోసం అరుగుపై పెట్టి, దారి తెలియని క్రొత్తవారికి దారి గురించి చెబుతూ, అవసరంలో ఉన్న వారికి రాత్రి తన అరుగుపై ఆశ్రయాన్నిచ్చి, వీలైనంత వరకు వారి ఆకలి దప్పులు తీరుస్తూ మర్నాడు వేకువ ఝామునే జీవనోపాధికోసం తోటపని చేసికోవటానికి బయలుదేరుతూ జయవిజయులను ఆకర్షిస్తాడు. వీరు అంధుని సమీపించి, "అయ్యా! రాత్రి నుండి నిన్ను గమనిస్తున్నాము. బొత్తిగా ఈశ్వరారాధన అనేది నీ దినచర్యలో ఎక్కడా కనిపించలేదు. ముఖ్యంగా ప్రాతఃకాల సమయం ఈశ్వరారాధానకు మంచిది కదా? ఈ సంగతి నీకు తెలియదా ?"అని ప్రశ్నిస్తారు. అంధుడు వినయంతో, "అయ్యా! ఈశ్వరారాధనయొక్క అసలైన స్వరూపం రాత్రి బాటసారులకు వెలుగు చూపటం, పగలు పరిశ్రమ చేయటం అని మాత్రమే నాకు తెలుసు. ఇంతకుమించి విధి విధానాలు ఏమీ తెలియని వాడిని" అని బదులు పల్కుతాడు. తరువాత, భూలోకాన్ని వదలి వెళ్ళిపోయిన జయవిజయులను చూచి వారి ద్వారా విషయాలు విన్న విధాత అత్యంత ప్రసన్నుడై **"ఉపాసన"** అంటే కేవలం జప, తప, ధ్యానాలు కావని, ఆదర్శంతో నిండిన అంతఃకరణలోనే ఈశ్వరుడు నివసిస్తూ ఉంటాడని ఋజువు చేసిన అంధుడే ధార్మిక కర్మకాండల నాచరిస్తున్న వ్యక్తుల కంటె కూడ స్వర్గాధికారానికి అర్హుడని నిర్ధారించి, అంధుణ్ణి సగౌరవంగా స్వర్గానికి తోడ్కొని రమ్మని జయవిజయుల్ని భూలోకానికి పంపిస్తాడు.

**కథ 44 :** శక్తివంతుడైన వృత్రాసురుడు యేవిధంగానూ మరణించక దేవతలు భీతి చెందినపుడు, ఎవరైనా తపోసంపన్నుని వెన్నెముకతో ఆయుధ నిర్మాణం జరిగితే కేవలం దానితో మాత్రమే వృత్రాసురుడు మరణిస్తాడని బ్రహ్మ తెలియజేస్తాడు. ఇంద్రునితో సహా సమస్త దేవతలు దధీచి వద్దకు వెళ్ళి విషయాన్ని విన్నవిస్తారు. ఒకనాడు ఇంద్రుడు దధీచి మహర్షి తపోశక్తికి భయపడి, అనేక విధాలుగా ఆయనను బాధించాడు. అయినప్పటికి మహర్షి ఇంద్రుని ద్వేషించక అతని కోర్కెను మన్నించి పరమార్థ ప్రయోజనానికి దేవతల రక్షణకు ఈ నశ్వర దేహం ఉపయోగపడుతుందీ అంటే నాకు అంతకంటే ఆనందమేమున్నదని చెప్పి యోగబలంతో దేహత్యాగం చేస్తాడు. ఆ విధంగా దేవతలు వజ్రాయుధ నిర్మాణం చేసి వృత్రాసురుని వధిస్తారు. త్యాగం వలన లభించే ఆనందం స్వర్గాన్ని మించినది.

**కథ 45 : త్యా**గమూర్తులు దైవం యేమైనా వరాలిస్తానని ముందుకు వచ్చినా విశ్వమానవ కళ్యాణం కోసమే కోరికలు కోరుకొంటారేగానీ, తమకంటూ యేదీకోరరు.

మహారాజైన రంతిదేవుని ప్రచండమైన తపోశక్తికి ఇంద్రాసనం ఊగిపోయింది. ఇంద్రుడు పరుగెత్తి వచ్చి, ప్రత్యక్షమై ఏమి కావాలన్నా అడుగు నీ కోర్కెలన్నీ తీరుస్తానని ప్రసన్నుడౌతాడు. కానీ రంతిదేవుడు వినమ్రుడై, "దేవరాజా! నాకేమీ వద్దు. కానీ నా రాజ్యంలోనేకాక సమస్త భూమండలంలోనూ ఎవ్వరూ

పీడంపబడకుండానూ, ఆకలితోను, దరిద్రంతోను బాధపడకుండ అన్న సంపదతో, ఆనందంగా జీవించాలి. జనుల హృదయాలలో వైరం, ఈర్ష్య, ద్వేషం, కలహాలవంటి దుర్భావనలు మచ్చుకైనా కానరాకుండా పరస్పరం స్నేహ సహకారాలతో జీవించాలి. రోగాలు, విపత్తులు, దుఃఖాలు ప్రజలను పీడింపరాదు. నా భూమిని 'హిరణ్యగర్భ'గా మార్చాలి. ఇది నా కర్తవ్యం అని నీవు గుర్తించి ఈ కర్తవ్య పాలనను పరిపూర్ణ నిష్ఠతో పాటించగల్గే శక్తి సామర్థ్యాన్ని నాకు ప్రసాదించు, చాలు" అని వేదనతో వేడుకొంటాడు.

**కథ 46 : త్యా**గం చెయ్యటం, ఇతరులకు సహాయం చెయ్యటం అనేవి తమకు తాము ఉద్ధరించబడటానికి లభించిన ఒక వైజ్ఞానిక ఉపచారం. ఇతరులకు మనము ఏదైతే ఇస్తామో అది రెట్టింపై మనకోసం దైవంయొక్క ఖజానాలో జమచేయబడుతుంది. తన రొట్టెను ఇతరులతో కలిసి పంచుకొని తినేవారికి దేనికీ లోటనేది ఏర్పడదు. కేవలం స్వార్థంతో తమ తిండి, తమ సుఖం తాము చూసుకొనే దురదృష్టవంతులే త్యాగంలో ఉన్న మధురిమను జారవిడచుకొంటూ ఉంటారు.

**శ్లో॥ ప్రేమైవ పరమేశోస్తి స ఆనంద స్వరూప ధృక్ ।**
**జడోవా చేతనో వాపి ప్రియతాం యాతి ప్రేమతః ॥**
**ఈశ్వరం ప్రతి ప్రేమ్ణేతి శ్రద్ధా దర్శాన్ ప్రతిధృవమ్ ।**
**ఆత్మవత్ సర్వ భూతేషు దృష్టి కోణో భవిష్యతి ॥**
**వసుధైవ కుటుంబం చ భావనాయాః క్రియాన్వితిః ।**
**కర్తారస్తే క్రియాలాపాభ విష్యన్త్యజ్ఞ సైవతు ॥**

ఉన్నత ఆదర్శాల పట్ల ఘనిష్ఠమైన ప్రేమ, శ్రద్ధ, ఎంత ఎక్కువ ఉత్పన్నమైతే వ్యక్తిలో ఈశ్వరునిపట్ల అంత ఎక్కువగా భక్తి ప్రపత్తులు ఉత్పన్నమౌతున్నట్లు గుర్తింపవచ్చు. ఈశ్వరారాధన సఫలమౌతున్నదీ లేనిదీ స్పష్టంగా అర్థమౌతూనే ఉంటుంది. నిజమైన భక్తునిలో "ఆత్మవత్ సర్వభూతేషు" అను ఉత్కృష్టమైన దృష్టికోణము, వసుధైవ కుటుంబక భావన, ప్రతి చిన్న కార్యకలాపంలోను స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది. **ప్రేమయే పరమేశ్వరుడు. కాబట్టి భక్తుడు జడమైనవి, చైతన్యమైనవి - అన్నింటినీ సమంగా ప్రేమించగల్గే స్థితిలో ఉంటాడు. తనను అంతటా అందరిలోను దర్శించ గల్గటం. వసుధాస్థలి సర్వస్వం స్వకుటుంబంగానే అనిపించటం, జీవితంలోని ప్రతి క్రియాకలాపం కూడ పారమార్థికమై ఉండటం - ఇవి ఈశ్వరభక్తుల ముఖ్యలక్షణాలై ఉంటాయి.**

**కథ 47 : చా**లాకాలంక్రితం ఆకాశం నుండి "ఎవరు నీవు" అనే ప్రశ్న వినిపించింది. సమస్త జీవులు ఆశ్చర్య చకితులై ఆకాశం వంక చూడసాగేయి. మరల అదే ప్రశ్న ఒకటి రెండు సార్లు వినిపించింది. ప్రాణులన్నీ విస్మయంగా పైకి చూశాయి. నాల్గవసారి ప్రశ్న వినిపించేసరికి ప్రాణిలోకం వినీ విననట్లు తమపని తాము చూసుకోవటం మొదలుపెట్టింది. ఒక్క మానవులు మాత్రం ఆ ప్రశ్న గురించి ఆలోచిస్తూ ఒకరినొకరు, ఎవరు ఎవరని ప్రశ్నించుకోసాగేరు, ఆ అజ్ఞాత కాలంలోని ఆప్రశ్న – ఈనాటికీ ప్రశ్నగానే మిగిలిపోవడమే గాక, ఆ ఒక్క ప్రశ్న మానవుని ఆలోచనలను పరుగులు పెట్టించి, పరివర్తన చెంది అనేక ప్రశ్నలుగా పరివర్తన చెందింది.

ఒకే ఒక ప్రశ్న అనేకత్వంపట్ల ప్రభావితురాలై తన మౌలిక రూపాన్నే విస్మరించకుండా, 'నీవు' ఎవరో, 'నేనూ–అదే' అని మానవునిచేత బదులు పల్కించి ఉంటే పరిస్థితులు ఎంత బాగుండేవి.

**కథ 48 : అ**ంతరంగంలో మోహం అనేది చుట్టుముట్టియున్న ఒకే ఒక స్థానం ఖాళీ అయినప్పుడు మాత్రమే ఆత్మీయత అనేది అంతరంగంలో ప్రవేశించడానికి అవకాశం కల్గుతుంది. కేవలం ఒకే ఒక మోహం నుండి ముక్తి లభిస్తే చాలు, అన్ని దిక్కులు 'తనవే'గాను; 'సర్వమానవులు తనవారుగాను' అనిపించటం మొదలవుతుంది.

శ్రావస్తీనగర నివాసి మాతా విశాఖ, తథాగతుని ఒకసారి తన ఆతిథ్యం స్వీకరించుమని ఆహ్వానించింది. బుద్ధుడు వెళ్ళగా, ఆమె మనమడు మరణించటం వలన దుఃఖిస్తూ నా మనుమని తిరిగి పునర్జీవితుని చేయుమని ప్రార్థిస్తుంది. బుద్ధుడు ఆమెను ఓదారుస్తూ, అమ్మా! ఈ నగరంలో ప్రతినిత్యం ఎందరో మరణిస్తూనే ఉన్నారు. వారందరూ నీ మనుమలు, పుత్రులుకారా? కాబట్టి ఏదో ఒకనాడు వియోగంతో దుఃఖాన్ని ప్రసాదించే వ్యక్తులు, వస్తువుల వలన లభించే సుఖాన్ని పొందాలని ఆశించకు. కేవలం **సేవద్వారా లభించే సుఖం మాత్రమే శాశ్వతమైనది.** దానిని పొందటానికి అనంతమైన ప్రపంచం నీముందు ఉన్నది. కాబట్టి నీకు చేతనైనంత సేవచేసి శాశ్వతమైన సుఖాన్ని పొందటానికి ప్రయత్నంచేయి. ఈనాడు నీ మనుమని నేను జీవింపచేసినప్పటికీ అతను ఏదో ఒకనాడు నీకు దూరమై దుఃఖాన్ని కల్పించక మానడు. కాబట్టి శాశ్వత ఆనందమార్గాన్ని చూపిస్తాను రమ్మని వెంట తీసుకొని వెళ్తాడు.

**కథ 49 : ఒ**క మందిరంలో పూజారి విధి విధానాలతో ప్రతిరోజు ఉదయం, సాయంత్రం దేవికి అర్చనలు చేసేవాడు. ఆ సమయం మినహా మిగిలిన సమయమంతా స్వార్థంతోను, అహంకారంతోను మిగిలిన దైవ సృష్టికంతకూ దుఃఖాన్ని కల్గించి చెడువాక్కులు, చెడు ఆలోచనలు, చెడు కర్మలు అవలంబించేవాడు. చూసి చూసి దైవం ఇది భరించలేక పూజారిని పిలిచి, మూర్ఖుడా నాకు ఎన్ని పూజలు చేసినా పూజానంతరం నా ప్రతిరూపమైన సమాజానికి సేవచేయని పక్షంలో ఈ పూజలు శుద్దదండుగ. నీకు నేను రాయిలోనే తప్ప జీవించే ప్రాణులలో కనిపించటం లేదా? అని కోపంతో దండిస్తుంది. పూజారి తన అజ్ఞానాన్ని మన్నించుమని దేవి పాదాలను గట్టిగా పట్టుకొంటాడు.

**పూజయొక్క పరిణామం 'సేవగా' మారాలి. పూజలు, ఉపాసనలు ఆచరించిన తర్వాత వ్యక్తిలో లోకసేవ చేయాలనే తపన జాగృతం కావటంలేదు. అంటే, ఆ పూజలు ఫలించటంలేదని, వ్యర్థమౌతున్నాయని, మీ ఉపాసనలలో ఎక్కడో ఏదో లోటు, పొరపాటు జరుగుతోందని గుర్తించండి.**

**కథ 50 : మ**హాభారతంలోని యుధిష్ఠిరుని చరిత్రలో వసుదైవ కుటుంబక భావనలు ప్రత్యక్షంగా కనిపిస్తాయి. అజ్ఞాతవాస కాలంలో యమధర్మరాజు అతడిని అనేకసార్లు పరీక్షిస్తాడు. కోనేరులో నీరు త్రాగే పాండవ సోదరులు నల్గురిని చంపి కేవలం యుధిష్ఠిరుని ద్వారా తన ప్రశ్నలకు లభించిన జవాబులకు తృప్తిచెంది యక్షుడు వరాన్ని కోరుకోమని ధర్మరాజుని అడిగినపుడు, తన రాజ్యాన్ని గాని, వైభవాన్ని గానీ కోరక అతడు తన లోభ, మోహ, క్రోధాలను జయించి తపోదాన సత్యవ్రతుడై జీవించాలని తనలో ఎన్నడూ ఎవరిపట్ల దుర్భావనలు ప్రవేశించక అందరిపట్ల ప్రేమభావనకల్గి జీవించాలనే వరాన్ని కోరుకొంటాడు. అలాగే అంతిమ సమయంలో కూడా యుధిష్ఠిరుడు హిమాలయాలగుండా పయనించేటపుడు ఒక్కరొక్కరుగా సోదరులు,

కుంతి, ద్రౌపది అందరూ మరణించిన తర్వాత దారిలో తోడుగా లభించిన ఒక కుక్కను వెంట పెట్టుకొని ముందుకు పయనిస్తూ ఉంటాడు. ఈలోగా ఇంద్రుడు విమానం తెచ్చి, నియమానుసారం కుక్కకు స్వర్గంలో ప్రవేశంలేదని, నీవు మాత్రం విమానాన్ని వచ్చి అధిష్ఠించుమని ఆహ్వానిస్తాడు. ఇంతవరకు తనకు తోడుగా వచ్చిన కుక్కను ఒంటరిగా వదలి రాజాలనని ధర్మరాజు ఇంద్రుని ఆహ్వానాన్ని తిరస్కరిస్తాడు. కుక్కరూపంలో నున్న యమధర్మరాజు ప్రసన్నుడై నిజరూపంలో దర్శనమిచ్చి యుధిష్ఠిరునికి గల జీవప్రేమపట్ల ఆనందాన్ని వ్యక్తం చేస్తూ అక్కున చేర్చుకొంటాడు.

**శ్లో॥ బాలానాం భక్షణే ప్రీతి స్తథా ఆదానే పిరతతాస్తుతే ।**
**ప్రౌఢా విభజ్య కాలేచ క్షుధార్తాస్తే దదన్త్యపి ॥**
**ఏవం విద్యా ఉదారాను దానినో యే వరంతుతే ।**
**అభావగ్రస్తా దృశ్యంతే రసాగ్రాహి విలాసినామ్ ॥**

ఆపదలోనున్న ఇతరులకు ఏదైనా ఇవ్వగల్గినవాడు, ఆకలితోనున్న ఇతరులకు ప్రేమగా తినిపించి, వారి ఆకలి తీర్చేవాడు, తన చేతికందివచ్చిన పుత్రుడని భగవంతుడు భావిస్తాడు. ఇటువంటి ఉదారులు, త్యాగశీలురు, పరిపక్వత చెందిన వ్యక్తులను భోగపరులు, సంపన్నులు దీనులుగా, హీనులుగా భావించినప్పటికీ దైవానుగ్రహం, కీర్తి, ఆత్మ సంతోషం అనబడు ఉత్కృష్టమైన మూడు సంపదలు దైవం తన పుత్రులుగా భావించిన వారికి మాత్రమే లభిస్తాయి. విశ్వంలోనున్న మిగిలిన సమస్త సంపదలు ఈ మూడు సంపదల ముందు తృణప్రాయమైనవి.

**కథ 51 : ఫ**కీరువలె అర్థనగ్నంగా తిరిగిన గాంధీ పాదాలచెంత నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, జమన్‌లాల్ బజాజ్ వంటి సంపన్నుల సమస్త సంపద, వైభవం వచ్చి వర్షించిన సంగతి సర్వ విదితమే. కానీ ఆ త్యాగమూర్తి ఆ సంపదను మాతృభూమి స్వాతంత్ర్యం కోసం వెచ్చించాడు.

బుద్ధుడు రాజ సింహాసనాన్ని త్యజించి, భిక్షాపాత్ర చేతపట్టి, తిరిగినప్పటికి ఆయన పాదాల ముందు అనేకమంది రాజులు, చక్రవర్తులు తమను తాము సమర్పించుకొన్నారు. ఇటువంటి మహా మానవుల పట్ల జనులకుగల భక్తి శ్రద్ధలు వర్ణించనలవిగానివి.

ఒక అచంచలమైన, అపూర్వమైన సత్యం ఏమిటంటే తమ సర్వస్వం పరమార్థానికై వినియోగించిన వారికి, కలిగినదాన్ని కలసి పంచుకొని తినగల వారికి, అపరిగ్రహ వ్రతాన్ని అచంచల నిష్ఠతో పాటించగల వారికి ఈశ్వరానుగ్రహం వెన్నంటి ఉండి సదా వారిపై వర్షిస్తుంది.

**కథ 52 : సంత్** రామదాస్ ధర్మ ప్రచారార్థం శిష్య సమేతంగా వెళుతూ ఉండగా మార్గమధ్యంలో అడవిలో భోజన సమస్య ఎదురైంది. నీవద్ద యేముంటే దానినే కలిసి పంచుకొని తినుమని రామదాసు ఆదేశిస్తాడు. గురువాదేశానుసారం శిష్యులు తమ వద్దనున్న **ఐదు రొట్టెలను** అందరూ కడుపునిండా భుజించి ఎక్కువైన మిగిలిన రొట్టెలను అటుగా వెళుతున్న బాటసారులకుకూడా పంచిఇస్తారు. కేవలం ఐదు రొట్టెలతో ఇంతమంది తృప్తి చెందటమేగాక, బాటసారుల ఆకలిని కూడా తీర్చగల రహస్య మేమిటని ఒక శిష్యుడు కుతూహలంగా ప్రశ్నిస్తాడు. **"పంచుకొని తినటంలో గల చమత్కారమే"**నని రామదాసు బదులు పల్కుతాడు.

**తన గురించికాక, మిగతా వారిని గూర్చి ఆలోచించటమనేది ఉత్కృష్టమైన భావన.** కొందరు వ్యక్తులే ఆదాచేసినవి అందరకూ ఉపయోగపడాలి అని మీరు భావించటం వలన మీలో కొందరి వద్ద నున్న ఐదు రొట్టెలు అక్షయ అన్నపూర్ణగా వృద్ధి చెందాయి. కూడగట్టాలని, దాచాలని భావించేవారు ఆకలితో దహించబడుతూ ఉంటారు. ఒకరికివ్వాలని, పంచుకొని తినాలనే ఆరాటపడే వారికి ఎంత తిన్నా ఆకలి తీరి, అనంతమైన తృప్తి కల్గుతుందనే సత్యాన్ని రామదాసు శిష్యులకు అక్కడ ఆ విధంగా అనుభవానికి తీసికొని వస్తాడు.

**కథ 53 :** నిద్రలేమి వలన బాధపడుతూ అనేక చికిత్సలు చేయించుకొని ఫలితం లేక బాధ చెందుతున్న ఒక చక్రవర్తికి జ్యోతిష్కుడు అత్యంత ప్రసన్నుడూ సుఖ జీవియైన వ్యక్తి యొక్క ఉత్తరీయాన్ని తెచ్చి ధరింపచేస్తే, ఆరోగ్యం బాగవుతుందని సలహా ఇస్తాడు. చక్రవర్తికి తమ వస్త్రం ఉపయోగపడితే మంచి బహుమతి లభిస్తుందనే ఆశతో అనేక మంది ఉత్తరీయాన్నీయటానికి ముందుకు వస్తారు. లాభం లేకపోవటంతో రాజభటులు గాలిస్తూ ఉండగా ఒకరోజు రోడ్డు మీద ఒక వ్యక్తి రామనామం చేస్తూ అత్యంత ఆనందంతో తనను తాను మరచి ఉండటం భటులు చూస్తారు. ఎంత రానన్నా వినకుండా అతనిని రాజభటులు రాజమందిరంలో ప్రవేశపెడతారు. తనకంటె ప్రసన్నుడైన ఆ వ్యక్తికి చక్రవర్తి నమస్కరించి, "అయ్యా! నీ ఉత్తరీయాన్ని ప్రసాదించి నాకు రోగ విముక్తిని కల్గించు"మని ప్రార్థిస్తాడు. ఆ వ్యక్తి చిరునవ్వుతో, "మహారాజా! నావద్ద కట్టుకోవడానికి, కప్పుకోవటానికి ఒకే ధోవతితప్ప ఉత్తరీయం లేదు. ప్రవహించే నీరు లాంటిది నా జీవితం" అని తెలియచేసి కానుకలకు, అభినందనలకు ఎదురు చూడకుండా నామ జపంతో తన్మయుడై అక్కడ నుంచి నిష్క్రమిస్తాడు. **సుఖం అనేది వస్తువులలోను, సంపదలోను, సౌకర్యాలలోను లేదని,** ఆనందం అనేది ఆత్మకే పరిమితమైనదని ఆ మహనీయుని పాద స్పర్శతో రాజమందిరంలోని ప్రతి ప్రాణికీ తెలిసింది.

**కథ 54 :** "Servants of Peoples" సంస్థ యొక్క సభాపతి లాలాలజపతిరాయ్‌యొక్క మరణ సమయం అసన్నమవడంతో, ఆ సభాపతిస్థానాన్ని భర్తీ చేయటానికి యోగ్యుడైన వ్యక్తి ఎక్కడ లభించగలడని గాంధీజీ ఆలోచించసాగేరు. అతి తక్కువ వేతనానికి తమ సుఖాన్ని, వైభవాన్ని వదలుకొని తమ జీవితాన్ని సమర్పణ గావించుకోవటానికి ఎవరు ముందుకు వస్తారు ? కానీ ఠండన్‌జీ ఈ వార్త తెలిసి తన బ్యాంక్ మేనేజర్ పదవిని వదలివేసి ఈ పదవిని ఆనందంగా స్వీకరిస్తానంటూ ముందుకు ఉరికాడు. బాపూ పాదాలకు నమస్కరిస్తూ. "బాపూ! లోక కల్యాణం కోసం మీరు వదలి వేయమంటే జీవితాన్ని కూడా ఆనందంగా వదలివేస్తాను. జీవితం ముందు బ్యాంకు మేనేజరు పదవి ఎంత అల్పమైనదో మీకు నేను వేరేచెప్పనవసరం లేదు." అంటూ జీవితం గడపడానికికూడా చాలీచాలని వేతనంతో అపరిగ్రహ జీవితాన్ని గడుపుతూ సభాపతి పదవీ బాధ్యతను స్వీకరిస్తాడు. బాపూ సమకాలికులలో ఈ త్యాగ మూర్తికి లభించిన కీర్తి, గౌరవం మరెవ్వరికీ లభించలేదు.

**శ్లో॥ ఉదార మనసాం భక్త జనానాం జీవనం మునే ।**
**విప్రా పరిగ్రహిత్వేన స్వభావేనయునం భవేత్ ॥**
**పరాయణం పరార్థేచ సాధూనామివ జాయతే ।**
**న భవంతి ధనాధ్యక్షా యద్య ప్యేతే తథాపితు ॥**

**చెడిపోయిన మనస్సే మనిషికి ప్రబల శత్రువు.**

**ఆత్మికానాం విభూతీనాం నిధిస్తే ప్రాప్నువన్త్యలమ్ ।**
**కుచేల సంపదా యేభ్యో న్యూనా మన్యేత నిశ్చితమ్ ॥**

నిజమైన భక్తజనులు బ్రాహ్మణునివలె అపరిగ్రహులు గానూ, సాధువునివలె పరమార్థ పరాయణులుగానూ జీవిత యాత్ర సాగిస్తూ ఉంటారు. వీరిని ప్రజలు ధనవంతులుగా అంగీకరించి సహించలేరు. కానీ వీరి వద్దగల ఆత్మ విభూతి సంపద ముందు కుబేరుని సర్వ సంపదలు సరితూగజాలవు.

**బ్రాహ్మణత్వమనేది, వర్ణము వలన కాక కర్మలవల్ల నిర్ధారించవలసియున్నది. నిజమైన బ్రాహ్మణుడు సంపదలు తనకోసం కోరక ఆపదలోనున్న వారికి పంచుటకై అనవరతము ఆతృత చెందుతూ ఉంటాడు. ఈ లక్షణమునే బ్రాహ్మణత్వముగానూ, బ్రాహ్మణ వృత్తిగానూ నిర్ధారించవలసియున్నది. నిరాడంబర జీవితమును గడుపుతూ, విశ్వ కళ్యాణ కారకుడైన భగవదేచ్ఛలో తన ఇచ్ఛ ను మిళితంచేసి ప్రలోభం అనేదాన్ని సమీపానికి కూడా రానీయక, లభించిన దానితోనే అత్యంత ప్రసన్నుడై జీవించుట బ్రాహ్మణుని స్వభావమై ఉంటుంది.**

**కథ 55 :** మధురబాబు అనే అనన్య భక్తుడొకసారి పట్టు వస్త్రాలను పరమహంసకు సమర్పిస్తాడు. వాటిని ధరించి ధ్యానమగ్నుడైన పరమహంస ధ్యానానంతరం సాష్టాంగ ప్రణామం ఆచరించటానికి ఉద్యుక్తుడౌతూ ఉండగా మనస్సులో క్షణకాలం **ఈ వస్త్రాలకు దుమ్ము అంటదుకదా!** అనే ఆలోచన కల్గింది. బ్రాహ్మణత్వాన్ని పాటించాలంటే ఇటువంటి వస్త్రాలను ధరిస్తే సాధ్యంకాదు. కాబట్టి ధరించటానికి ఒకటి, కప్పుకోవటానికి ఒకటి సాధారణమైన ముతక వస్త్రాలు నాకు సరిపోతాయని తెలియచేస్తూ, పట్టు వస్త్రాలను విప్పివైచి తిరిగి భక్తునకు ఇచ్చివేస్తాడు.

**కథ 56 : జీ**వనోపాధికోసం పేద బ్రాహ్మణుడైన పద్మనాభుడు కథాకాలక్షేపం చేస్తూ ఉండే వాడు. కానీ ఒకసారి ఆయన ధార్మిక గ్రంథాలను అధ్యయనం చేస్తూ ఉండగా, **జ్ఞానాన్ని దానంచేసి, దానికి ప్రతిఫలంగా ధనాన్ని స్వీకరించటం చాలా దోషం** అనే వాక్యాలను గుర్తించాడు. దానికి ఆయన మనస్సు కలత చెందింది. ఆధ్యాత్మిక క్రమశిక్షణను పాటించక, నియమోల్లంఘన చేస్తూ జ్ఞానాన్ని అమ్ముకొని కడుపు నింపుకొన్నానే అని దుఃఖించసాగేడు. జరిగినది జరిగిపోయినా, ఇకపైన ఈ పొరపాటు జరుగరాదని దృఢంగా నిశ్చయించుకొని అడవికిపోయి ఎండు కట్టెలు ఏరి తెచ్చి, బజారులో అమ్మి జీవనోపాధికి కావలసిన డబ్బులు సంపాదించటం మొదలు పెట్టాడు. కథా కాలక్షేపం ద్వారా ప్రజలు తామంత తాముగా సమర్పించిన దాన దక్షిణలతో లైబ్రరీలు స్థాపించటంలాంటి పనులు చేస్తూ, సమాజంలో జ్ఞానాన్ని వృద్ధి చేయటానికి కావలసిన ఏర్పాట్లు చేస్తూ, అనతికాలంలోనే **అసలైన పురోహితుడుగా** తనను తాను తీర్చి దిద్దుకున్నాడు.

**కథ 57 : మ**హారాష్ట్రలో పేష్వా మాధవరావుకు గురువుగా, మంత్రిగా, ప్రధాన న్యాయాధీగాను అనేక పదవులను నిర్వహించే రామశాస్త్రి అనే యోగ్యుడైన బ్రాహ్మణుడు నిరాడంబర జీవితాన్ని గడుపుతూ ఆదర్శానికి ప్రతిరూపంగా జీవయాత్ర సాగించేవాడు. ఆయన భార్య ఒకనాడు సాధారణ జనులకంటె కూడా సాదా వస్త్రాలను ధరించి, ముఖ్యమైన పనిమీద రాణీవద్దకు వెళ్ళటం జరిగింది. గురుపత్నిని ఆ స్థితిలో చూచిన రాణీ ఆశ్చర్యచకితురాలై, వారి ఆ దీనస్థితి రాజనిందకు కారణం కావచ్చునని భావించి గురుపత్నిని విలువైన వస్త్రాభరణాలతో అలంకరింపజేసి, ఆమె వచ్చిన పని పూర్తియైన తర్వాత, సాదరంగా పల్లకిలో

**గురువును అవహేళన చేస్తే అభ్యుదయం అంతా అంతరించిపోతుంది.**

కూర్చోపెట్టి ఇంటికి పంపిస్తుంది. శాస్త్రీజీ తలుపు చప్పుడు విని, తలుపులు తెరచి ఆశ్చర్యచకితుడై ఈ స్త్రీమూర్తి ఎవరో నాకు తెలియదని రాజమందిరాలకు వెళ్ళటానికి బదులు పొరపాటున ఈ పేద ఇంటికివచ్చి ఉంటుందని, దయచేసి రాజమందిరానికి తీసుకొని వెళ్ళమని బోయీలను కోరుతూ తలుపు మూసుకొంటాడు. శాస్త్రిగారి ధర్మపత్నికి భర్త స్వభావం పూర్తిగా తెలిసి ఉండటంవలన వెంటనే రాణీ మందిరానికి వెళ్ళి ధరించిన వస్త్రాభరణాలను తిరిగి ఇచ్చివేసి యధాప్రకారంగా కాలినడకన ఇంటికి తిరిగి వచ్చింది. తలుపు తెరచి శాస్త్రీజీ భార్యవంక ప్రేమ దృక్కులతో వీక్షిస్తూ, “దేవీ! బ్రాహ్మణుడు ఇతరులకు మర్యాదా పాలనను నేర్పుతూ, తన సహజమైన సంపద **నిడారంబరతతోనే ఆనందంగా జీవించాలి.”** అని పల్కుతూ సాదరంగా లోనికి తోడ్కొనిపోతాడు. బ్రహ్మాండమంతటి బ్రాహ్మణత్వానికి ప్రతిరూపమైన శాస్త్రీజీ పాదాలపై శిరస్సునుంచి ఆ ఇల్లాలు కన్నీటితో కాళ్ళు కడుగుతుంది.

అపరిగ్రహాన్ని అక్షరాలా పాటించిన బ్రాహ్మణులలో **చాణుక్యుడు, సుధాముడు** అగ్రగణ్యులు. చంద్రగుప్తుని రాజ్య సింహాసనంపై కూర్చుండబెట్టి, విశాల భారత నిర్మాణాన్ని గావించిన చాణుక్యుడు అనంతమైన వైభవం, సిరిసంపదల మధ్య కేవలం ఒక ముతక వస్త్రాన్ని ధరించి, కూలిపోతున్న కుటీరంలో జీవయాత్ర సాగించిన బ్రాహ్మణుడు. ఇతర దేశంలో ఒకసారి చాణుక్యుని మేధాశక్తిని కీర్తిస్తూ, దుశ్శాలువా కప్పి చాణుక్యుని సత్కరించగా, ఆయన వెంటనే దానిని ప్రక్కనేయున్న పని వానికి ఇచ్చి వేస్తాడు. సాదా జీవితానికి ప్రతిరూపమైన ఇటువంటి మహనీయులే చంద్రగుప్తుని వంటి శిష్యులను తయారు చేయగల సత్తా కల్గి ఉంటారు.

సుధాముడు జగన్నాయకుడైన కృష్ణునికి మిత్రుడు. ఒక గురుకులానికి కులపతి అయినా సాదా జీవితాన్ని జీవిస్తూ, బ్రాహ్మణ ధర్మ పాలనను తు.చ. తప్పకుండా నిర్వహిస్తాడు. అనంతమైన సంపదను, వైభవాన్ని పాదాలముందు కురిపించినప్పటికీ బ్రాహ్మణోచిత జీవితాన్ని సంపూర్ణ నిష్ఠతో పాటించటం వలన సుధాముని పట్ల కృష్ణుడు విశేషమైన ప్రేమాను రాగాలు చూపించేవాడు.

**కథ 58 : ఒ**కసారి భోజమహారాజు దర్బారుకి సోమదత్తుడనే బ్రాహ్మణుడు వచ్చి, ఉజ్జయనీ నగరంలో భాగవత కథలు వినిపించటానికి ఆజ్ఞ ఈయవలసిందిగా కోరుతాడు. భోజమహారాజు నిరాకరిస్తూ కొంతకాలం భాగవతాన్ని పఠించి ఆ తర్వాత రమ్మంటాడు. చెప్పినట్లుచేసి రెండవసారి వచ్చినా కూడా నిరాకరిస్తూ భాగవతాన్ని బాగా అర్థంచేసికొని కంఠస్తం చేసి రమ్మని పంపించివేస్తాడు. తరువాత ఎంత కాలానికి బ్రాహ్మణుడు రాకపోయే సరికి భోజరాజు ఆయనను వెదకడం ప్రారంభిస్తాడు. ఒక చెట్టు క్రింద భాగవత పారవశ్యంతో ధనం మీదగానీ, కీర్తిమీద గానీ కోరికలేని స్థితిలో బ్రాహ్మణుడొకనాడు దర్శనమిస్తాడు. భోజరాజు ఆయనకు నమస్కరించి మీ భాగవత కథలు ఫలించి సమాజంపైన ప్రభావాన్ని చూపటానికి సరియైన సమయము ఇదేనంటూ సగౌరవంగా బ్రాహ్మణుని ఉజ్జయనీకి తీసుకొని వెళతాడు. రాజు ఇచ్చిన పారితోషికాలన్నింటినీ బ్రాహ్మడు దారిలోనే పేదలకు పంచివేస్తాడు.

భక్తుడు తన కోర్కెలను త్యాగం చేస్తే భగవంతుడు స్వయంగా భక్తునిలో కలసిపోతాడు. దేవుడు కొలువైయున్న ఆ మందిరానికి వేరే కోర్కెలు, అవసరాలు అంటూ ఏమీ ఉండవు.

సాధువుగా మారటం భక్తుని రెండవ విశేషం. మాయనుండి దూరంగా తొలగి తనను తాను జన కల్యాణానికి వినియోగించుకోగల వాడు సాధువే. కేశవానంద్ అనే ఆయన అసలైన సాధు ధర్మాన్ని నిర్వర్తిస్తూ

రాజస్థాన్‌లో విద్యాపీఠాలు నిర్మించాడు. జన సహకారంతో ఆయన మహిళల స్వావలంబనకు, అక్షరాస్యతకు నడిపిన ఉద్యమాలు ప్రతి పరమార్థ పరాయణుడైన వ్యక్తికీ కూడా మార్గదర్శకం అయినవి.

ఆదిశంకరాచార్య సంస్కృతిని రక్షించటానికి భజగోవింద శ్లోకాలను గొంతెత్తి పాడుతూ, భారతదేశమంతా పరిభ్రమించాడు. ఈ శ్లోకాలలో ధర్మానికి సంబంధించిన అనేక మూఢ విశ్వాసాలు ఖండించబడ్డాయి. అంతేకాక, ఈ విధంగా శంకరాచార్య పరిభ్రమిస్తూ ధనవంతులను మానవకల్యాణానికి తమ ఐశ్వర్య రాసులను వినియోగించేందుకు వివశుల్ని చేసి పూర్తి సాఫల్యాన్ని సాధించేడు. తమ వ్యాధుల్ని, బాధల్ని కూడా లెక్కచెయ్యక అనవరతం పరహితార్థం కోసం పాటుపడే ఇటువంటి వారంతా సదా పూజనీయులేకదా!

మహాత్ముడైన ఆనందస్వామి ఆర్యసమాజ వేదికను ఆలంబనగా చేసికొని సమాజ సంస్కరణ, పరమార్థం, ఈశ్వర భక్తిని గూర్చి సందేశాత్మకమైన నినాదాలనిస్తూ తన సమస్త సంపదను సమాజానికే అర్పించివేసిన మహనీయుడు. మహాత్ములు అంటే అసలైన నిర్వచనం ఇటువంటివారే. వీరు చిరంజీవులై జీవితాంతం సమస్త ధార్మిక సాంప్రదాయాల పట్ల ప్రగాఢమైన భక్తి శ్రద్ధలను కల్గి ఉండగల్గడానికి మూల కారణం వీరి అంతరంగంలోని పరమార్థ పరాయణతే తప్ప, మరేవిధమైన సౌకర్యాలు, సదుపాయాలుకాదు.

శ్లో॥ **భక్తే రుదార భావస్య జాయతే త్వరుణోదయః ।**
**సహకారి ప్రవృత్యా తత్ప్రయాసోత్ర విధీయతామ్ ॥**
**వాసః పరస్పరాపేక్షీ విభాజాపేక్షి భోజనమ్ ।**
**స్థితి ప్రమోద పూర్ణా చహ్యస్యా ఏవోపలభ్యతే ॥**
**సహయోగేన పంథాః సప్రశస్తః ప్రగతేర్మతః ।**
**సంఘ బద్ధత్వమేవేదం సామర్థ్య పరమం స్మృతమ్ ॥**

ఉదార భావనతో కూడిన భక్తి యొక్క అరుణోదయ కాంతి కిరణాలు **"సహకారం"** అనే ప్రవృత్తి ద్వారా మాత్రమే ప్రసరించబడతాయి. నవ్వుతూ నవ్వించగల పరిస్థితులు నలుదిక్కులా సృష్టిస్తూ, ఉన్నదానిని ప్రేమతో పంచుకొని తింటూ, సహకారంతో కలసిమెలసి జీవించడం వల్లనే ప్రగతి పథం ప్రాశస్త్యాన్ని పొందగల్గుతుంది. సంఘీభావాన్ని మించిన గొప్ప సామర్థ్యం మరేదీలేదు. **దైనందిన జీవితంలో భక్తి భావనలు మేళవించినపుడు వ్యక్తుల ద్వారా నలుదిక్కులా వెదజల్లబడేవి సహకార వీచికలు. ఈ సమస్త సృష్టి చక్రం పరమార్థం మీదనే తిరుగాడుతూ ఉంది. విత్తనం విశాల వృక్షంగా రూపు ధరించాలంటే తనను తాను పూర్తిగా ధూళితో కప్పి వేసుకోవాలి. తల్లి పుత్రోదయాన్ని దర్శించాలంటే తన శరీరంలోని రక్త మాంసాలను సంతాన నిర్మాణానికి సమర్పించి,** ప్రసవ వేదనను అనుభవించినపుడే సాధ్యమవుతుంది. నదులుగాని, వృక్షాలుగాని, భూమిగాని, ఆకాశంగానీ సృష్టిలో వేటిని ఉదాహరణగా తీసికొన్నప్పటికీ, అన్నీ కూడా అంతులేని కష్టాన్ని సహిస్తూ పరమార్థం కోసం పాటుపడుతున్నవే. **స్వార్థం, ఏకాకితనం అనేవి సమాప్తమైనపుడు మాత్రమే లోనున్న అంధకారం పలాయనం చిత్తగించి, అంతరంగం తేజోవంతమవుతుంది.**

**కథ 59 : దే**వదానవుల మధ్య ఎవరుగొప్ప అనే విషయంలో ఒకసారి పోట్లాట చెలరేగింది. నిర్ణయం కోసం ఇద్దరూ బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళగా, బ్రహ్మ ఇద్దరినీ చెరో పంక్తిలోను కూర్చోబెట్టి, మృష్టాన్న

**హృదయంలోని విషయాన్ని చెప్పలేని మాట ఒక దయ్యం.**

భోజనాలు వడ్డించి, తినే సమయానికి మోచేతుల వద్ద వంగకుండా, చేయి నోటి వద్దకు రాకుండా మాయ పన్నుతాడు. రాక్షసులు చేతిని నిటారుగా ఎత్తి అంత ఎత్తుమీద నుండి నోటిలో పడవేసుకుంటూ, పదార్థాలను చెల్లాచెదరు చేయసాగేరు. దేవతలు ఉదారులు, సహకారులు కావటం వలన ఒకరి నోటి కొకరు అందించి తృప్తిగా భోజనాలు ముగించారు. ఈ చిన్న సంఘటనతోనే బ్రహ్మ ఇద్దరిలో ఎవరు గొప్పో ప్రత్యక్షంగా నిరూపించి చూపించాడు.

**కథ 60 : అం**త్యకాలంలో బుద్ధుడు శిష్యులను పిలచి, “నాయనలారా! మీరు సత్యం, ధర్మంపట్ల స్థిరంగా ఉంటూ లభించినది పంచుకొని తింటూ పరస్పరం మిత్ర భావంతో మెలుగుతూ ఉండటం వలన ఎంతటి ఘోర విపత్తులు ఎదురైనా అవలీలగా అధిగమించగలరు. పరాజయం అనేది మీ ప్రాంగణంలో అడుగు పెట్టజాలదు” అని సందేశమిస్తాడు.

**సంఘటిత శక్తి, సహకారం, ఈ రెండూ భక్తియొుక్క రెండు నేత్రాలు.** ఈ రెండే అన్ని పరిస్థితులలోను మానవుని ధన్యుణ్ణి చేస్తాయి. సంఘటిత శక్తియొుక్క స్థూల మహత్యం జనసముదాయాల శ్రమశక్తి ద్వారా ప్రతినిత్యం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం.

**కథ 61 : ఒ**క వ్యక్తి ఒక మహాత్ముని వద్దకు వచ్చి, “అయ్యా! అధిక సంతానం, అతి తక్కువ ఆదాయంతో బాధపడుతున్నాను. ఆకలి బాధతో రోజు కొకరు చొప్పున మరణిస్తున్నారు. ఏదైనా దారి చూపుమని” ప్రాధేయపడతాడు. మహాత్ముడు “నాయనా! ఇటువంటి ప్రతీ చిన్నదానికి దైవాన్ని, మహాత్ములను ప్రాధేయపడనవసరం లేదు. కుటుంబం అనే రథం లాగటానికి సిగ్గుపడకుండ ఎవరికి ఎంత శక్తి ఉంటే అంతవరకూ తలోచేయివేసి కుటుంబ రథాన్ని లాగి గమ్యం చేర్చండి. చావులు అరి కట్టబడటమే గాక, ప్రశాంత జీవితం లభిస్తుంది” అని చెప్పి పంపిస్తాడు. ఇదే వ్యక్తి కొంతకాలం తర్వాత విలువైన కానుకలతో మహాత్ముని వద్దకు వచ్చి నమస్కరించి, “స్వామీ! కుటుంబ సభ్యులందరూ కలసిమెలసి తలొక పని చేసికోవటం వలన మా సంసార రథం దేవుడు ఊరేగుతున్న పూలరథం కంటె కూడా వైభవంగా సాగిపోతోంది. **దైవానుగ్రహం, మహాత్ముల ఆశీర్వాదాల కంటెగూడా సహకారం, సంఘటిత శక్తి** గొప్పవని, వాటి ద్వారా అప్పటికప్పుడే ఫలితాలను పొందవచ్చునని మాకు అర్థమయిందని” తెలియ చేస్తాడు. “భగవంతుని ఆశీర్వాదం కూడా కోరకుండానే కలిసి మెలసి బ్రతికే వారికి, పంచుకుని తినే వారికే లభిస్తుంది నాయనా!” అంటూ మహాత్ముడు ఆ వ్యక్తిని ఆశీర్వదిస్తాడు.

**కథ 62 :** కొన్ని పక్షులు ఒకనాడు వేటగాని వలలో చిక్కుకొని ప్రాణరక్షణ కోసం ఒకేసారి వలనెత్తుకొని ఎగిరి పోవటానికి ప్రయత్నించాయి. అది చూచి బోయవాడు వలవెంబడి పరుగెట్టి పరుగెట్టి అలిసిపోగా ఒక మహాత్ముడు అతడిని ఆపి, “నాయనా! కలసి ఎగురుతున్నంత వరకు వీటి వెనుక నీవు ఎంతగా పరుగెత్తినా లాభంలేదు” అని తెలియజేసి ముందుకు సాగిపోతాడు. కొన ఆశతో వల వెంట పరుగెట్టే బోయవాడు కొంతదూరం వెళ్ళిన తర్వాత వల క్రింద పడటం చూస్తాడు. ఎక్కడ దిగాలి అనే విషయంలో పక్షుల మధ్య వివాదం చెలరేగి కొన్ని ఎగరడం మానివేయడంతో వలతో సహా పక్షులన్నీ క్రిందపడి బోయవాని చేతికి చిక్కి మరణించాయి.

**కర్మఫల వ్యవస్థ పట్ల అవిశ్వాసమే నాస్తికతకు గుర్తు.**

శ్లో॥ సంకీర్ణ స్వార్థభావంయే నరా గృహ్ణంతి సర్వదా ।
దివ్యాభ్యో వంచితా నూనమనుభూతిభిరేవతే ॥
భక్తి మాత్రాశ్రయేణేమే లాభాః ప్రాప్యంత ఏకదా ।
ఆత్మ కల్యాణ మీశాప్తిర్విశ్వ కల్యాణ మేవచ ॥

భవబంధనానికి హేతువు సంకుచిత స్వార్థపరత్వం. ఈ స్వార్థ పాశంలో చిక్కుకొని మానవుడు భక్తియొక్క ఉచ్చస్థాయికి చెందిన ఆనంద ప్రాప్తినుండి దివ్యానుభూతి నుండి వంచించబడుతూ ఉన్నాడు. ఒకే ఒక అలంబనమైన భక్తి ఆధారంతోనే ఆత్మ కల్యాణం, విశ్వ కల్యాణం, భగవత్ సాన్నిధ్యం –ఈ మూడు పరమ లక్ష్యాలు ఒకే సారిగా వ్యక్తికి ప్రాప్తించగలవు.

పట్టుపురుగు తన నోటి నుండి స్రవించే ద్రవంతోటే గూడు కట్టుకొని దానిలో బందీయై తన మరణానికి తానే కారణమవుతుంది. వివేకం గల పురుగు తాను కట్టుకొన్న గూడు బ్రద్దలు చేసికొని బంధ విముక్తురాలై గగనంలోకి ఎగురుతుంది. మానవుడు కూడా అజ్ఞానం వలన ఈ విధంగానే స్వార్థంతో తన చుట్టూ గూడు కట్టుకొని దాని మధ్యనే మ్రగ్గి మరణిస్తున్నాడు. కాస్త వివేకాన్ని ఆశ్రయించగల్గితే తెలివైన పట్టుపురుగులాగనే బంధనాలను ఛేదించుకుని, పైకి ఎగిరి గగనంలో విహరించగలడు.

**మానవునికి ఈశ్వరుని ద్వారా కోరకుండానే ప్రసాదించబడిన అమూల్యమైన వరమే ఈశ్వరభక్తి.** ఈ భక్తి ఆశ్రయంగా తీసికొని హృదయంలోని ఆత్మీయతను వెదజల్లగల వ్యక్తులు తమను తాము ఉద్ధరించుకోగల్గటమే గాక, లోకాన్ని కూడా ఉద్ధరించగల్గుతున్నారు. ఈ విధంగా వీరు పొందుతున్న అనుభూతి ఈశ్వర సాక్షాత్కారంతో సరితూగగల మహోన్నతమైనది. చివరకు ఈ భక్తి భావనే ముక్తికి, మోక్షానికి గూడా కారణమవుతుంది.

**కథ 63 : అ**ర్జునునికి, శ్రీకృష్ణునికి మధ్య బాంధవ్యం ఉన్నప్పటికీ కూడా ఆ బాంధవ్యం స్థిరపడినది అర్జునుడు తనలోని స్వార్థపరత్వాన్ని వదలుకున్నప్పుడు మాత్రమే.

అంతరంగం దీనంగా, హీనంగా పిరికితనంతో ఉండి గాండీవాన్ని ధరించి రథాన్ని అధిరోహించి ఏమి చేయాలో కూడా ఆలోచించలేని పరిస్థితి అర్జునునిది.

మహాభారత యుద్ధంయొక్క ఉద్దేశ్యం కేవలం సోదరుల మధ్య పోట్లాటను అంతం చేయటం గాదు. అస్తవ్యస్తంగా ఉన్న సామంతవాదం కారణంగా భారత భవిష్యత్తు నిరంతరం చింతా జనకంగా తయారవుతూ ఉన్న పరిస్థితులలో రాబోయే జటిల సమస్యలను దూరం చేయటమే ముఖ్య ఉద్దేశ్యంగా యుద్ధం నిర్వహించవలసియున్నది. కాబట్టి కృష్ణుని బోధ ఈ నిమిత్తంగా చేయబడినదే. వ్యామోహం అనేదాన్ని ఒకసారి జయిస్తే అది అవినీతిమీద విజయంగా పరిణతి చెందుతుంది. కృష్ణుని ఉపదేశం వలన అర్జునుడు విశ్వమానవ శ్రేయస్సుకై పాటుపడడంలో సాఫల్యాన్ని సాధించడమేగాక ఆయన ముక్తి మార్గాన్ని కూడా సుగమం చేసికోగలిగాడు.

**కథ 64 : ఆదర్శమైన అధ్యాత్మ మార్గంలో పయనించేవారికి లోభం, మోహం అనే భవబంధనాలు సంకెళ్ళవంటివి.** సంగ్రహం, విలాసం, ఆశ – వీటిలో చిక్కుకున్న వ్యక్తులను లోభ లిప్స వశపరచుకొని, పరమార్థ రసాన్ని ఆస్వాదించనీయదు. స్వార్థపరులు, పరమార్థాన్ని, స్వార్థాన్ని త్రాసులోని రెండు సిబ్బెలలోను

పెట్టి స్వార్థం వైపే ఏదో ఒకరాయి, రప్ప చేరుస్తూ బరువుని పెంచి, పరమార్థం వైపు సిబ్బె తేలిక అయ్యేలా నేర్పుగా తూకం వేస్తూ ఉంటారు. ఉత్కృష్ట మార్గంలో ప్రవేశించాలను కొనే వారందరికి **విత్తేషణ, పుత్రేషణ, అహం** – ఈ మూడింటినీ త్యజించిన తర్వాతనే ఆ శ్రేయోమార్గంలో కాలు మోపండని మహాత్ములు సలహానిస్తారు. ఈ విధమైన మనోనైర్మల్యం ప్రాప్తించకుండా భక్తి అనేది వ్యక్తిలో ప్రవేశించదు. ఈ స్థితికి జేరని వ్యక్తుల ద్వారా ప్రదర్శింపబడే భక్తి కేవలం ప్రదర్శనగానూ, ఆడంబరంగానూ పేర్కొనబడింది. అంతరంగం స్వచ్ఛంగా మారిన మరుక్షణం ఆ వ్యక్తికి దైవం దూరంగా నిలువలేక తనంత తానే ఆ వ్యక్తిలో స్థిరనివాసాన్ని యేర్పాటు చేసికుంటాడు. ఈ సత్యాన్ని భక్త కబీరు ఎలా తెలిపారంటే : **"ప్రేమ మార్గం చాలా ఇరుకైనది. ఆ మార్గంలో ఇద్దరు ఇమడలేరు. ప్రేమతో కూడిన ఆ భక్తి మార్గంలో 'నేను' ఉన్నంతకాలం 'హరి రాలేదు' ఈనాడు ఆ మార్గంలో హరి అడుగిడటం వలన, అక్కడ 'నేను' తప్పుకోక తప్పింది గాదు."**

**శ్లో॥ ఆత్మీయం ప్రేమ యత్యస్త భావనాభరితం మనః ।**
**ప్రత్యక్షం స్వర్గం ఆనందాను భూతిం తు రసన్తియే ॥**
**భవంతి కృతకృత్యాస్తే ప్రాప్తం ప్రాప్తవ్య మేవతైః ।**
**ఏకార్థ సుఖ సౌ విద్యభావః సంకీర్ణ స్వార్థజః ॥**

ప్రేమ భావనతో పూర్తిగా నిండియున్న అంతఃకరణ ప్రత్యక్షంగా స్వర్గమే. పాత్ర నిండిన తర్వాత ప్రక్కలకు తొణకకమానదు. అలాగే పూలలోని సుగంధం వాయువుని సుగంధ భరితం చేయకుండాను, తుమ్మెదలను, తేనెటీగలను తమలోని మకరందాన్ని స్వీకరించమంటూ పువ్వులు ఆహ్వానించకుండానూ ఉండలేవు. సరిగ్గా ఇదే స్థితి సదా ఆనందానుభూతికి లోనైన వ్యక్తులది కూడా. వీరు తమ అంతరంగంలోని ఆనందాన్ని పంచుతూ ఉండాలని సదాకోరుతూ ఉంటారు. ఇటువంటి అంతరంగాలనే దైవం తన మందిరాలుగా భావించి, అక్కడ నివసిస్తూ నిత్యపూజలు అందుకొంటూ ఉంటాడు.

**కథ 65 : అ**నంతశయన తీర్థంలోని కృష్ణ విగ్రహానికి చోళనరేంద్రుడు విలువైన ఆభూషణాలను ధరింపజేస్తాడు. అలాగే ఒక పేద బ్రాహ్మణుడు కూడా వచ్చి, తన వద్దనున్న తులసి దళాలను, కృష్ణునకు సమర్పించి జలంతో అభిషేకిస్తాడు. ఇది రాజుకు నచ్చలేదు. వివాదం చెలరేగింది. చోళరాజు శ్రీకృష్ణుని ప్రసన్నుని చేసుకోవటానికి కోట్ల ధనాన్ని ఖర్చుచేసి విరాట్ యజ్ఞాన్ని నిర్వహిస్తూ ఇద్దరిలో ఎవరు గొప్ప భక్తుడో తేల్చమంటూ ప్రముఖ పూజారులను ఆజ్ఞాపిస్తాడు. యజ్ఞయాగాలు నిర్వహించలేని పేద బ్రాహ్మణుడు విరాట్ యజ్ఞం జరుగుతున్నంత కాలం కేవలం విష్ణు పూజలోనే గడిపివేస్తాడు. నెలలు గడిచాయి, ఇలా ఉండగా బ్రాహ్మణుడు పూజానంతరం పెట్టే నైవేద్యం వారం రోజులుగా ఎవరో అపహరించసాగేరు. దొంగ ఎవరో తేల్చుకోవాలని తొమ్మిదవరోజు బ్రాహ్మణుడు సావధానంగా ఉంటాడు. మామూలు సమయానికి దైన్య స్థితిలోనున్న ఒక ఛండాలుడు వచ్చి, రొట్టెలు అపహరిస్తూ బ్రాహ్మణుని కంటపడతాడు. బ్రాహ్మణుని హృదయం ద్రవించింది. ఇంత దీనంగా బలహీనంగా ఉన్న వ్యక్తి కేవలం ఎండు రొట్టెలు ఎలా తినగలడని తలంచి దీపంకోసం తెచ్చిన నెయ్యిని కూడా రొట్టెలలో నంచుకొని తినుమంటూ, గిన్నె పట్టుకొని ఛండాలుని వెంట పరుగు పెట్టాడు. ఛండాలుడు తన నిజ స్వరూపంతో విష్ణుమూర్తి రూపంలో దర్శనమిచ్చి బ్రాహ్మణుని తన విమానంలో కూర్చుండపెట్టుకొని వైకుంఠానికి తీసుకొనిపోతాడు. విరాట్ యజ్ఞాన్ని నిర్వహించే రాజు ఇదంతా చూచి నిశ్చేష్టుడవుతాడు.

**తన దోషాలను గుర్తించకపోవడాన్ని మించిన దోషం లేదు.**

భక్తుడు నావ నడిపే నిషాదుడే కావచ్చు, ముసలిదైన శబరి కావచ్చు. వనాలలో గెంతులు వేసే వానరులైనా సరే భగవంతుడు అనుగ్రహించడానికి వెనుకాడడు. దుర్యోధనుని భోజనం కంటె విదురుని భోజనం శ్రేష్ఠమైనదిగా భావించినవాడు పరమాత్ముడు. కాబట్టి నిర్మలమైన అంతఃకరణ ఎక్కడ ఉంటుందో అక్కడే భగవంతుడు ఉంటాడు.

**కథ 66 :** ఏదోఒకనాడు తుకారామ్‌ను నీచుడుగా నిరూపించాలని భావించి ఒక వ్యక్తి ప్రతి రోజు తుకారాం ఇంటికి కీర్తనలు వినాలనే వంకతో వస్తూండేవాడు. కొంతకాలానికి అలాంటి ఒకరోజు రానేవచ్చింది. తుకారామ్ గేదె అతని చేలో మొక్కలు పాడుచేసిందని ఇంటి మీదకు వచ్చి తిట్టసాగేడు. తుకారాం చలించక, నిశ్చలంగా దైవ ప్రార్థన చేసుకోవటం చూచి మరింత కోపంచి ఒక ముళ్ళ కట్ట తెచ్చి రక్తం కారేలా కొట్టసాగేడు. అయినా కూడా ప్రతిఘటించక, తుకారాం నిశ్చలంగా ఉండిపోతాడు. అంతేగాక ఆ సాయంత్రం ఆ వ్యక్తి ప్రతిరోజులా విష్ణు భజనలు వినటానికి రాకపోయేసరికి చింతిస్తూ, అతని ఇంటికి వెళ్ళి తన గేదె ద్వారా జరిగిన తప్పుని మన్నించుమని కోరి విష్ణు భజనలు వినటానికి రమ్మంటూ వెంట పెట్టుకుని వస్తాడు. ఈ సంఘటన ఆ వ్యక్తి జీవితాన్నే మార్చివేసింది. తరువాత అతడు తుకారాం ప్రియ శిష్యుడవుతాడు. **తమ పట్ల ఎంతో క్రూరంగా వ్యవహరించే వ్యక్తుల పట్ల కూడా అపరిమితమైన వాత్సల్యాన్ని, స్నేహాన్ని కురిపించగల్గటం మహాత్ముడి మొదటి లక్షణం.**

**కథ 67 :** సమర్ధగురు రామదాసు రెండు మూడిండ్లలో భిక్షాటన చేసి లభించిన దానితో వంట చేసుకునేవాడు. యథాప్రకారం ఒకనాడు ఒక ఇంటిముందు భిక్షాటనకై నిలచి పిలువగా, ఆ ఇల్లాలు కోపంతో ఇల్లలుకుతున్న గుడ్డను ఈయన ముఖం మీద విసిరికొట్టింది. ఆయన చిరునవ్వుతో తిరిగివెళ్ళి నదిలో స్నానంచేసి ఆ గుడ్డను శుభ్రంగా ఉతికి, ఎండవేసి ఆ గుడ్డతో దీపపు వత్తులు తయారుచేసి సాయంత్రం పూజా సమయంలో దేముని ముందు దీపాలు వెలిగించి, "ఓ ప్రభూ! ఈ వత్తులు యేవిధంగా ప్రకాశాన్నిస్తున్నాయో అదే విధంగా ఆ ఇల్లాలు హృదయాన్ని గూడా ప్రకాశవంతం చేయమని" నిండు హృదయంతో ప్రార్థన చేస్తాడు.

ప్రతి వ్యక్తి హృదయంలోనుకూడా ఇంతటి ఉదాత్తమైన భక్తిభావనలే నిండి ఉంటాయి. కానీ వ్యక్తి స్వార్థం, ఏకాకితనం, వీటికి బానిస అవగానే క్రమంగా ఈ ఉదారభక్తి భావనలు నశించ నారంభిస్తాయి. ఇటువంటి వ్యక్తులయొక్క మహత్వకాంక్ష వీరిని క్షణకాలం శాంతిగా జీవింపనీయక బ్రతికి ఉండగానే నరకాన్ని అనుభవింపజేస్తుంది.

**కథ 68 :** మహారాజైన సంజయునికి సంతానం లేదు. సంతానం కోసం అతను బ్రాహ్మణులను భక్తితో సేవించేవాడు. బ్రాహ్మణులు రాజుకి సంతానాన్ని ప్రసాదించుమని నారదుని కోరగా, నారదుడు నీకు ఎటువంటి పుత్రుడు కావాలని రాజుని ప్రశ్నిస్తాడు. లోభం వలన రాజు తన పుత్రుని మలమూత్రాలు కూడా స్వర్ణమయం కావాలని కోరుకుంటాడు. నారదుడు 'తథాస్తు' అంటాడు. రాజ్యం అంతటా ఈ వార్త వ్యాపించింది. కొందరు చోరులు ఈ కబురు తెలిసికొని బాలుణ్ణి అపహరించుకు పోతారు. ఈ బాలుణ్ణి ముందుగా ఎవరి వద్ద ఉంచుకోవాలనే విషయంలో చోరులమధ్య పోట్లాట వచ్చింది వారు బాలుణ్ణి చంపి బంగారాన్ని సమంగా పంచుకోవటానికి నిర్ణయం తీసుకుంటారు. ఈ విధంగా బాలుడు మరణిస్తాడు. బాలుని మరణవార్త విని

**తన లోపాలను కనుగొని తొలగించుకునే వ్యక్తి బుద్ధిశాలి, దూరదర్శి.**

రాజు, దొంగలను కూడా పట్టి వధిస్తాడు. **లోభమే** సర్వపాపాలకు, దుఃఖాలకు మూలమని రాజుకి చివరకు అర్థమవుతుంది.

హిరణ్యాక్ష, హిరణ్యకపువుల అంతిమ స్థితి కూడా ఇదే. వీరు సృష్టిలోనున్న వైభవానికంతకూ ఆధిపత్యం వహించాలని ఆశించి, రాక్షసత్వంతో విజృంభించి చివరకు నశిస్తారు. కౌరవుల దురాశకూడా చివరకు వారినే కబళించి వేసింది.

శ్లో॥ **అహమ్మన్యతయా సార్థముదారా భక్తి భావనా ।**
**స్థాతుం నైవ సమర్థాస్తి ద్వయోరేకో విశిష్యతే ॥**
**జీవనం సరళ ముచ్చ విచారా ఇతి భావనామ్ ।**
**భక్తాభజంతి స్వల్పంచ భుంతే భోజయంత్యలమ్ ॥**
**యాచన్తే స్వల్పమేవాలం ప్రయచ్ఛంతి చ హర్షితాః ।**
**అల్పం కామాయ మానాస్తే దాతుకామా భవంత్యలమ్ ॥**

**సాదాజీవనం మహాత్ముల మరియొక లక్షణం :** నిరాడంబరంగా జీవించలేని వారికి సంగ్రహించాలనే కోర్కె ప్రబలమై అంతరంగంలోనికి ప్రవేశించే ఉన్నతమైన ఆలోచనలకు అడ్డుపడుతూ ఉంటుంది. కాబట్టి భక్తజనులు **సాదాజీవనం, ఉన్నతమైన ఆలోచనలు** – ఈ రెండింటికి అధిక ప్రాధాన్యతనిస్తారు. వీరు తక్కువ తింటూ ఎక్కువ తినిపించడం, తక్కువ పొందటం ఎక్కువ ఇవ్వటం కోసం తపన చెందుతూ ఉంటారు. మానవమాత్రులపట్ల గల కర్తవ్య పథంలో నిలబడాలని కోరే వ్యక్తికి మహత్వ కాంక్షలనేవి ఉండనే ఉండవు.

**కథ 69 :** పరమహంస తల్లి అవసానకాలంలో కొడుకు వద్ద ఉండాలని వచ్చింది. మధురానాథ్ గురువైన పరమహంసకు, ఆయన తల్లికి శ్రద్ధగా సేవ చేసేవాడు. అమ్మా! నీకేం కావాలన్నా నాకు చెప్పు. క్షణంలో తెచ్చి నీముందుంచుతాను అని పదే పదే చెబుతూ ఉండేవాడు. ఆమె చిరునవ్వు నవ్వి నాకు అన్నీ ఉన్నాయి నాయనా, నీకు నా ఆశీస్సులు. నీవు ప్రశాంతంగా ఉండుమని చెప్పేది. కానీ మధురానాథ్ తృప్తి చెందక పదే పదే యేమి కావాలని అడగటం వలన, నాకు నశ్యం తెచ్చి పెట్టుమని అడుగుతుంది. మధురాబాబు కన్నుల నీళ్ళునిండాయి. ఇటువంటి నిర్మోహం కల తల్లికి రామకృష్ణుని వంటి పుత్రుడు కల్గటంలో ఆశ్చర్యం యేమున్నదని అనుకుని ఆమె పాదాలకు నమస్కరించి ఆనాటి నుండి విసిగించటం మానివేశాడు.

**కథ 70 :** ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కిశోరావస్థలోనున్నప్పుడు ఒకనాడు ఒక స్నేహితుని వెంట పెట్టుకుని వచ్చి తల్లికి పరిచయం చేస్తూ, ఇతడు 'ఫీజు' కట్టడానికి ధనంలేక పరీక్ష రాయలేకపోతున్న నా స్నేహితుడు. నీవేమైనా సహాయం చేయగలవేమోనని నీవద్దకు తీసుకొని వచ్చాను అని చెబుతాడు. తల్లి వెంటనే మెడలోనున్న ఒక్కగానొక్క మంగళసూత్రాన్ని తీసి అమ్మివైచి ఆ బాలుని 'ఫీజుకి' యేర్పాట్లను గావిస్తుంది. ఆ బాలుడు పరీక్షలో ఉత్తీర్ణుడై ఆమె పాదాలకు నమస్కరిస్తూ మంగళసూత్రాన్ని తీసికున్నందుకు ఎంతగానో దుఃఖిస్తాడు. ఆమె ఆ బాలుని అక్కున చేర్చుకుంటూ, నాయనా! దాని పేరే మంగళసూత్రం. కాబట్టి మంగళకరమైన ఒక పనికి ఉపయోగపడింది. దీనిలో దుఃఖించవలసినదిగాని, విచారించవలసినదిగానీ యేమీ లేదని ఓదారుస్తుంది. ఇటువంటి మహోన్నతురాలైన తల్లి ఒడిలో పాఠాలు నేర్చుకున్న భాగ్యశాలి గనుకనే ఈశ్వరచంద్ర విద్యాసాగర్ హృదయంలో బాల్యం నుండి కూడా కలిగినదాన్ని పంచుకొని తినాలని, ఆత్మీయతతో కలసి జీవించాలనే టటువంటి ఉత్కృష్ట భావనలు ఉద్భవించాయి.

**ఆత్మవిశ్వాసం, నిరంతర పరిశ్రమ, దృఢ నిశ్చయాలకు అసాధ్యమేదీ లేదు.**

**కథ 71 :** ప్రఖ్యాతిచెందిన ఒక మహాత్ముడు, ఊరి చివర కుటీరంలో నివసిస్తూ విరామ సమయంలో "ఏక్‌తార" వాయిద్యాన్ని వాయిస్తూ ఉండేవాడు. ఈయన ఖ్యాతిని గూర్చి విని ఒక ధనికుడు దర్శనానికై వస్తాడు. వస్త్రాలు శిథిలమై ఉన్నా, ముఖం దివ్యతేజస్సుతో వెలుగుతూ తనకు స్వాగతం చెప్పటానికి కుటీరం ముందు నిలబడిన ఆ మహాత్ముని జూచి ధనికుడు సానుభూతితో...., "మహాత్ములు ఇంత దరిద్రంతో దుర్భరంగా కష్టాల ననుభవిస్తూ ఇంత దైన్యంగా ఉంటారా?" అని ప్రశ్నిస్తాడు. మహాత్ముడు అందుకు మందహాసంతో, "ఓ సంపన్నుడా! దరిద్రులైన మహాత్ముల వద్ద ఇవ్వటానికి అపారమైన అనేక సంపదలు ఉండటం వల్లనే నీవంటి సంపన్నులందరూ యాచించటానికి వస్తూ ఉంటారు. మావంటి దరిద్రులు తమ వద్దనున్న సంపదలను పాత్రత గలవారు ఎవరు లభిస్తారా, ఎంత ఎక్కువ పంచుదామా అని ఎదురుచూస్తూ ఉంటాము. మేము ఎంత పేదరికంతో, ఎంత దైన్యంగా ఉన్నప్పటికీ నీవంటి సంపన్నులను యేమీ యాచింపజాలము. ఒకవేళ యాచించవలసి వచ్చినప్పటికీ ఎకాఎకీ ఈశ్వరుని మానవమాత్రులందరి కోసం యాచిస్తామే తప్ప మాకిది కావాలంటూ మీవంటి సంపన్నుల ముందు చేయిచాచే ప్రసక్తే లేదని" తెలియ చేస్తాడు. ఏదో అడుక్కోవాలని వచ్చిన ధనవంతుడు సిగ్గుతో తల వంచుకుని అచ్చట నుండి నిష్క్రమిస్తాడు.

**కథ 72 : ధ**ర్మం, సంస్కృతి పతనంకావటం, పరాభవించబడటం చూడలేక నాగేష్‌భట్ అనే విద్వాంసుని హృదయం కలతచెంది ఏదైనా మార్గం చూపమంటూ గురువుని ఆశ్రయిస్తాడు. **ఆర్ష సాహిత్యాన్ని ఈ యుగానికి అనువైన రీతిలో పునరుద్ధరించటంకంటె సరియైన మార్గం మరొకటిలేదని** గురువు తెలియజేస్తాడు. అసలైన ఈశ్వరభక్తి, వ్యక్తి యొక్క కర్తవ్య ధర్మం కూడా ఇదేనంటూ గురువు తెలియజేయగానే సంస్కృతిని కాపాడాలనే పవిత్ర భావనలు, నాగేష్‌భట్‌ని సతతము అధ్యయనం చేయుమని, అనువదించుమని, లిఖించుమని, ప్రేరేపించనారంభించాయి. పేదరికం, ఇబ్బందుల మధ్య సాగుతున్న అతని ప్రయత్నాలు సాధనా సంకల్పం పవిత్రమైనవి కావటం వలన అతని కీర్తి సర్వత్రా వ్యాపించి మహారాష్ట్ర పేష్వా బాజీరావు వరకు చేరింది. పుస్తకాల గుట్టల మధ్య కూర్చొని, లిఖిస్తున్న నాగేష్‌భట్‌ను దర్శనార్థం వచ్చిన పేష్వా చూచి ఆశ్చర్యచకితుడై పుస్తకాలను కాస్త ప్రక్కకు తొలగించి పాదాలకు నమస్కరించటానికి కాస్త చోటుచేసుకుంటూ, "ఓ పూజ్యుడా! నీ కృషికి కావలసిన ఆర్థిక సహాయాన్ని నీవు అనుమతిస్తే నేను చేస్తానంటూ" నివేదిస్తాడు. ఈ మాటలు అతని ఏకాగ్రతను భంగం చేయగా కనులెత్తి చూచి, "ఓ మహారాజా! ఒక్క సూత్రానికి వ్యాఖ్యచేయటం కోసం వెతకబడే గ్రంథాలను మీరు కూడా కాస్త వెతికి నాకు సహకరిస్తే చాలు. ఈ నా చేతుల్లో వ్యక్తి వ్యక్తికి వ్రాసి అందించటానికి కావలసిన అనంతమైన శక్తి ఉన్నది. హృదయంలో విశ్వకళ్యాణ కాంక్షాబీజాలు ఉన్నాయి. ఇంతకంటే ధనంతో అవసరం యేముందని" పలుకగానే రాజు ఆశ్చర్య చకితుడై నిర్లోభంతో కూడిన ఆ పలుకుల వెనుక పవిత్రతకు శిరస్సువంచి ప్రణామం చేస్తాడు.

**కథ 73 : ప**రమహంస శిష్యులమధ్య ఉపదేశం గావిస్తూ ఉండగా బ్రహ్మానందమనే శిష్యుడు లేచి, "గురుదేవా! భక్తికి నిర్వచనం తన సర్వసుఖాలు, కోరికలు త్యజించటమే అయితే ఇంక పురుషార్థానికి స్థానమేముంది ? భౌతిక సుఖాల మధ్య ఉంటూనే భగవంతుని ప్రేమించటం బాగుంటుంది కదా?" అని ప్రశ్నించాడు. పరమహంస పకపకానవ్వి, నాయనా! ఆకాశంలో దట్టంగా మేఘాలు క్రమ్మినపుడు నీ చుట్టూ ఉండేది అంధకారంతప్ప, మధ్యాహ్న మార్తాండుని ఎండ, వేడి లభించవు గదా. అదే విధంగా **జపం, తపం, భక్తి, ఐశ్వర్యం** ఒకే దగ్గర కలిసి బ్రతకలేవు. పురుషార్థం కేవలం జీవనోపాధికి మాత్రమే

**భగవంతుడు అవతరిస్తాడు. కానీ అతడు నిరాకారుడు, అతడి అసలు శక్తి జాగృత ఆత్మ.**

అనివార్యం. కానీ కోరికలు, సుఖాలకు పురుషార్థం దారితీసే పక్షంలో మహత్వ **కాంక్షలకు వ్యక్తి** బలియై పతనం కాకమానదు" అంటూ భుజం తట్టగానే శిష్యుని అజ్ఞానం మంచులా కరగిపోయింది.

**శ్లో॥ భక్తిర్భావుకతానైవ తత్రోచ్ఛాదర్మతామతా ।**
**సరళం యేతు జీవంతి తేషామేషాతు సంభవేత్ ॥**
**అన్యే తాత్కాలికాన్ భావావేశాన్ భక్తిం వదంతితు ।**
**భ్రమంతితే భ్రమావర్తే పరాన్నః భ్రామయంత్యపి ॥**

**భక్తి అంటే భావుకత కాదు. సత్కర్మలుగా పరిణతిచెందే అంతరంగంలోని ఔదార్యం పేరే భక్తి. ఉన్నత ఆదర్శాలు భక్తిని ఆశ్రయించి విడదీయలేనంతగా ముడిపడి ఉంటాయి. కొందరు తమ చౌకబారు భావావేశాలకు 'భక్తి' అనే పేరు పెట్టి తాము భ్రమల్లో చిక్కుకొని ఇతరుల్ని కూడా భ్రమపెడుతూ ఉంటారు.** భజనలు, కీర్తనలు మొ॥ వాటికి మహత్తు లేకపోలేదు. కానీ వాటిని నిరుద్దేశ్యంగా మార్చిపారవేసి ఆడంబరాన్ని వ్యాపింపచేయటం వలన ప్రజలు భ్రమల సాలెగూటిలో అల్లుకు పోతున్నారు. ఆదర్శం అనేది ఆచరణగా జీవితంలోనికి దిగిరానపుడు ఇటువంటి భావావేశాలవలన యేమి ప్రయోజనం ?

**కథ 74 : ఒ**క పూజారి ప్రతి నిత్యం అర్చనకు వచ్చి హారతి ఇస్తూనే భావావేశంతో తనను తాను మరచిపోయేవాడు. అర్చన పూర్తికాగానే ఇంటికి తిరిగివచ్చి, భార్యాబిడ్డలను తిట్టడం, కర్కశంగా వ్యవహరించటం చేస్తూ ఉండేవాడు. ఒకనాడు అతనివెంట ఆలయానికి వచ్చిన చిన్న కుమారుడు భగవంతుని ముందు నిలబడి, తండ్రి భగవంతుని కరుణాసముద్రుడా అంటూ స్తుతించటం, ప్రార్థించటం చూసాడు. వెంటనే తండ్రిని ఉద్దేశించి, "నాన్నా! గంటల తరబడి స్తోత్రాల ద్వారా ఇంతగా కీర్తించబడుతున్న ఈ కరుణా సముద్రుని వద్ద నీవు ఎంతో కాలంగా పూజారిగా ఉండి కూడా ఆయన కరుణకాస్తయినా నేర్చుకోనపుడు ఇక్కడ పూజారిగా ఉండి యేమి ప్రయోజనం?" అని ప్రశ్నించాడు. ఆ పసివాని మాటలకు తండ్రి సిగ్గుతో కుంచించుకుపోయాడు. తాను తప్పును దిద్దుకోడానికి నిర్ణయించుకొన్నాడు.

పళ్ళేలతో రకరకాల నైవేద్యాలు దైవానికి సమర్పించటం, అఖండ జపాలు, పూజలు, కీర్తనలు, చేయటం వంటివి మనం మన ప్రతిభ, సంపదలను మానవులముందు ప్రదర్శించినట్లే దైవం ముందు కూడా ప్రదర్శించటానికి చేస్తున్న ప్రయత్నాలు మాత్రమే. మనం పెట్టే నైవేద్యాలు, సమర్పించే కానుకలు ఎంత ఎక్కువగా ఉంటే అంతగానూ మన మనోవాంఛలు నెరవేరుతాయని చాలామంది మూర్ఖులు భ్రాంతిపడుతూ ఉంటారు. వారిని చూచి దైవం జాలిపడతాడేగాని, వాటికి ఆశపడి వారి కోర్కెలు తీర్చడానికి పరుగెత్తి ఎంతమాత్రమూ రాడు.

**కథ 75 :** నగరంలోని ఒక సేఠ్ పళ్లెం నిండుగా ముత్యాలను నైవేద్యంగా భగవంతునికి సమర్పించి తన సమస్యలను నిర్మూలించుమని దైవాన్ని ప్రార్థించటం కోసం మందిరంలోనికి ప్రవేశిస్తాడు. అంతక్రితమే మందిరంలోకి ప్రవేశించిన పేదవాడైన ఒక వ్యక్తి దైవం ముందు నిలబడి రెండు చేతులూ జోడించి, "ఓ దేవా! నన్నుచూచి ఎవ్వరూ ఈర్ష్య చెందని విధంగానూ, యే చింతా లేకుండా సుఖ నిద్రపోయేలాగ నాకు ఈ జీవితాన్ని ఒక వరంగా ప్రసాదించావు. ధన్యుడను" అంటూ కృతజ్ఞతలు తెలియజేయడం చూచి, సేఠ్ నిశ్చేష్టుడవుతాడు. వారంలో మూడుసార్లు కథాశ్రవణం చేస్తూ, ప్రతినిత్యం గంటకు తక్కువ కాకుండా

ఆలయంలో భజన చేస్తూ, దైవానికి అనేక విలువైన కానుకలను సమర్పించే తనకు లభించని ప్రసన్నత ఈ పేదవానికి లభించడం, నాపట్ల దైవం ఉపేక్ష చూపి, ఈ దరిద్రుణ్ణి ఇంతగా ఆపేక్షించడంలో గల బలమైన కారణం యేమై ఉంటుందని సేఠ్ ప్రముఖ పురోహితుణ్ణి ప్రశ్నిస్తాడు. పురోహితుడు కొంతసేపు ఆలోచించి, "సేఠ్‌జీ! కేవలం నీవు నీ భావావేశాన్ని ఈశ్వరుని ఉపాసనగా భావిస్తున్నావు. కానీ ఆ పేదవాడుదైవాన్ని తన స్వామిగా భావించి హృదయంలో నిలుపుకొన్నాడు. దైవానికి ఏమేమి సమర్పిస్తే అదే నీకు లభిస్తూ ఉంటుంది. పేదవాడు దైవానికి అత్యంత ప్రీతికరమైన ప్రేమను, స్నేహాన్ని సమర్పించి ప్రతిఫలంగా శాంతిని, సంతోషాన్ని పొందగలిగేడు. నీవు కూడా వాటినే సమర్పించడానికి ప్రయత్నించుమని" తెలియజేస్తాడు.

**కథ 76 : ఒ**క మహాత్ముని సభలోనికి ఆహ్వానించి, తమ సందేహాలకు సమాధానాలు తెలియచేయమని ప్రజలు ప్రార్థిస్తారు. మహాత్ముడు వేదికను అలంకరించి చుట్టూ కలయ చూడగా, సభలో ఒకచోట ఒక వ్యక్తి శరీర బాధతో మూల్గుతూ కనిపిస్తాడు. మహాత్ముడు వెంటనే వేదికను దిగి అతని సేవలో లగ్నమౌతాడు. ఇది చూచి విరోధులు కొందరు వ్యంగ్యంగా, "మహాత్మా! సభను చూచి భయపడుతున్నట్లున్నావు. కాకపోతే శాస్త్రార్థాలను వివరించడానికి వచ్చి, ఆ ప్రముఖ కర్తవ్యాన్ని విస్మరించి ఎవరికో చికిత్స మొదలుపెట్టటమేమిటని" ప్రశ్నిస్తారు. మహాత్ముడు శాంత, గంభీర స్వరంతో, "సోదరులారా! మీలో ఎవ్వరి పుత్రుడైనా సరే నూతిలో పడినపుడు మిగిలిన పనులన్నీ వదలివేసి వెంటనే నూతిలోనికి దూకి వానిని రక్షించని వారుంటారా? ఇది కూడా కేవలం ఇటువంటిదే".

"శాస్త్రార్థాలు, వ్యాఖ్యానాలు అనేవి జీవితంలోని అత్యంత సాధారణమైన కార్యక్రమాలు. పీడిత మానవసేవ, ప్రజల వ్యధలు బాధలు దూరం చేయటం, జీవితంలోని అత్యంత ప్రధానమైన తక్షణ కర్తవ్యాలు" అని తెలియచేస్తాడు.

**కథ 77 : ఒ**క వ్యక్తి భావావేశంలో గృహస్థ ధర్మాన్ని త్యజించి, హరిద్వార్ వచ్చి ఒక బాబావెంట ఉత్తరాఖండం చేరుకున్నాడు. నెమ్మదిగా సన్యాసాశ్రమం స్వీకరినస్తానని గట్టిగా కబుర్లు చెప్పేవాడు. కానీ పిల్లలు గుర్తురావడం, ఎలా బ్రతుకుతున్నారో వారనే ఆలోచనలు చుట్టుముట్టడంతో ఉద్రేకం పశ్చాత్తాపంగా పరివర్తన చెందింది. బాబాకు నమస్కరించి, కొన్నాళ్ళు ఇంటికి వెళ్ళి జీవనోపాధికి నా వాళ్ళకి యేమైనా ఏర్పాట్లు చూచి వస్తానని, అప్పటికి ఇక్కడ చలికూడా కాస్త తగ్గుతుంది. కాబట్టి కాస్త సుఖంగా ఉంటుందని బాబాకు తెలియజేస్తాడు. బాబా చిరునవ్వునవ్వి, "సోదరా! వాస్తవం నుండి ఎన్నడూ పారిపోవటానికి ప్రయత్నించకు. వెళ్ళి గృహస్థ ధర్మాన్ని సక్రమంగా నిర్వహించు. గృహాన్నే తపోవనంగా మార్చు. ఈ రోజే బయలుదేరి వెళ్లు మని ఆదేశిస్తాడు.

**కథ 78 : భ**క్తి యొక్క అసలైన రూపం అతి తక్కువ మందికి తెలుసు తీర్థయాత్రలు, నదీ స్నానాలవల్ల లభించే పుణ్యం దేనికోసమో కూడా తెలిసికోకుండా వీటికోసం చాలా ధనాన్ని ఖర్చుచేసేస్తూ ఉంటారు. శిక్ష, ప్రేరణ, వీటికి సంబంధించిన జ్ఞానం లేకపోవడం వలన ఇంటివద్ద కూర్చొని కూడా పొందగల్గిన ఈ ఫలితాన్ని తీర్థాలు, క్షేత్రాలు తిరిగినా కూడా పొందలేకపోతున్నారు.

ఒక వృద్ధురాలు తీర్థయాత్రల కోసమని చాలా కష్టపడి కొంత ధనాన్ని దాచుకొన్నది. యాత్రకు బయలుదేరే సమయానికి ఇరుగింట్లో అబ్బాయికి ధనాభావం వల్ల చికిత్స చేయించలేక తల్లితండ్రులు రోదిస్తున్న

**సమయాన్ని వృధా చేయడం ఒక రకం ఆత్మహత్య.**

వార్త చెవినిపడింది. తాను దాచిన డబ్బు సంచితో మృత్యు ముఖంలోనున్న ఆ పిల్లవానికి చికిత్స చేయించింది. ఆ కుటుంబం వారంతా అత్యంత ఆనంద భరితులయ్యారు. రెండవసారి మళ్ళీ డబ్బు కూడగట్టి యాత్రకు బయలుదేరుతూ ఉండగా దారిలో నిరాశ్రయులైన వరద బాధితులు కంటపడ్డారు. ఆ డబ్బుతో వారందరి ఆకలి తీర్చి వెనక్కి తిరిగివచ్చింది. జీవనోపాధికోసం అందరకు పిండి విసురుతూ తీర్థయాత్రల మాట మరచి, ఆనందంగా జీవించే వృద్ధురాలి ముందు ఒక మహాత్ముడు సాక్షాత్కరించి, "అమ్మా! దైవం నీకు రెండు సంపూర్ణ తీర్థయాత్రల ఫలితాన్ని ధారపోయుమని నన్ను పంపించాడు. **పరమార్థ పరాయణత్వాన్ని మించిన తీర్థయాత్ర లేదని** ఆచరణ ద్వారా ఋజువు చేసిన నీవు ధన్యురాలివి" అని పల్కి అంతర్ధానమయ్యాడు.

**శ్లో॥ సంకీర్ణా స్వార్థపరతై వ విద్యతే భవబంధనమ్ ।**
**లోభ మోహావహంకారఇతి తస్యాస్త్రయః సుతాః ॥**
**ఇదం కుటుంబ యాత్రాపి వాస మాధాస్యతి ధృవమ్ ।**
**తత్రే ర్ష్యా కలహద్వేషపాత దుర్వ్యసనాని చ ॥**
**ప్రసంగా త్ప్రత్యహం నూన ముదేష్యంతి తదే దృశాః ।**
**ఆత్మప్రతాడనాం లోక భర్త్సనాం ప్రాప్నువంతిచ ॥**

సంకుచిత స్వార్థపరత్వమే సర్వబంధనాలకు హేతువు. లోభం, మోహం, అహంకారం అనే ముగ్గురూ స్వార్థం యొక్క పుత్రులు. ఈ కుటుంబం ఎక్కడ అడుగుపెడితే అక్కడ, ఈర్ష్య, ద్వేషం, కలహం దుర్వ్యసనం, పతనంవైపు లాక్కొనిపోయే ప్రసంగాలు ఉత్పన్నమవుతాయి. ఇటువంటి వాతావరణంలోని వ్యక్తులు ఆత్మగ్లాని, లోకనింద అనే రెండు వ్యాధులతో బాధపడుతూ జీవించి ఉండగానే నరకాన్ని అనుభవిస్తూ ఉంటారు.

**కథ 79 : శి**ష్యుడు గురువుతో దేహంతో ఉండగానే నరకంలో ఉన్నట్లు మానవుడు జీవితాన్ని ఎలా గడుపుతాడో వివరించుమని ప్రశ్నిస్తాడు. గురువు శిష్యునికి దివ్య దృష్టిని ప్రసాదించి, అధికశాతం ప్రజలు జీవయాత్ర సాగిస్తున్న జగత్తుని జ్ఞాన చక్షువులతో వీక్షించుమని ఆదేశిస్తాడు. శిష్యునికి ధనమదంతో కాముకుడైన సేఠ్, ఆవేశపరమైన మానసిక స్థితికల యువకుడు, లోభంతో మ్రగ్గుతున్న మానవుడు ఈ ముగ్గురూ కనిపిస్తారు. మొదటివాడు క్షణికమైన సుఖభోగాలలో మునిగి తృప్తిలేక వేదనతో కాలం గడుపుతూ ఉంటాడు. రెండవ వాడు క్రోధం వలన తనను తాను మరచి ఆవేశంతో దహించుకు పోతూఉంటాడు. ఇక మూడవ వ్యక్తి లోభత్వం వల్ల దగ్గర వాళ్ళు బంధువులు కూడా తిరస్కారంతో నీచంగా చూస్తూ ఉంటే వింటూ భరిస్తూ సాధన సంపత్తులు ప్రోగుచేసుకొంటూ బ్రతుకు ఈడుస్తున్నాడు. వారి ప్రతిక్రియలు శిష్యుని దివ్య చక్షువులకు స్పష్టంగా కన్పించాయి. గురువు శిష్యుని యథాస్థితికి తీసికొని వచ్చి, "చూసేవా నాయనా! దేహధారులైన జనులు ఇక్కడే, ఇప్పుడే అనుభవిస్తున్న కుంభీపాక రౌరవాది నరకాలంటే ఇవే. వీరికి లభించిన దేహాలు మానవులవి – మనోభూమి పిశాచాలది" అని తెలియజేస్తాడు. దేహాలతో ఉంటూనే ప్రత్యక్ష నరకాలను అనుభవిస్తున్న మానవులను చూచి శిష్యుడు భయభ్రాంతుడై ఈ భవబంధనాల నుండి ముక్తి లభించే మార్గాన్ని చెప్పమంటూ గురువు పాదాలపై వ్రాలి వెక్కి వెక్కి ఏడ్వసాగేడు.

**కథ 80 :** ఒకసారి కాకాభుశుండికి, విద్యాంసుడైఉండి ఆత్మజ్ఞానం లేకుండ దీర్ఘజీవితం గడిపే వ్యక్తి ఎవరైనా ఉంటారా? అని తెలిసికోవాలనే కుతూహలం కల్గింది. ఇలాంటి వ్యక్తిని వెదకడానికై వశిష్ఠుని ఆజ్ఞను తీసికొని బయలుదేరాడు. గ్రామాలు, నగరాలు, వనాలు, పర్వతాలు గాలించగా చివరకు విద్యాధరుడనే బ్రాహ్మణుడు ఈ అర్హతలన్నీ కల్గిన వాడని, యే ప్రశ్నకైనా సునాయసంగా జవాబు చెప్పగల సమర్థుడని తెలిసికొని కాకాభుశుండి అత్యంత ఆనందభరితుడౌతాడు. కానీ ఇంతటి విద్వాంసునికి ఆత్మజ్ఞానిగా ఎందుకు గుర్తింపు లభించలేదా అని ఆశ్చర్యం కల్గి, ఈ కారణం తెలుసుకోవాలని కాకాభుశుండి విద్యాధరుని అనుసరించసాగేడు.

ఒకనాడు విద్యాధరుడు నీలగిరి పర్వతప్రాంతంలో విహరిస్తూ ఉండగా సౌందర్యవంతురాలైన ఒక రాజ కన్యను చూచి ముగ్ధుడై కుక్క ఎముక ముక్కకోసం పరుగెత్తినంత నీచంగా ఆమెను వెంబడిస్తాడు. ఆ సమయంలో అతనికి శాస్త్రజ్ఞానం, పురాణజ్ఞానం యేదీ గుర్తురాలేదు. ఇంతలో రాజభటులు చూచి, అతడిని బంధించి కారాగృహంలో పడవేశారు. **ఆత్మ జ్ఞానానికి అవరోధమైనది విషయాసక్తియని, మోహం, లోభం - ఈ బంధనాలు ముక్తికి అవరోధాలని** కాకాభుశుండికి అర్థమైంది.

మోహవశమైన పురుగు దీపం చుట్టూ తిరిగి దానిలో పడి మరణిస్తోంది. చేప గేలం ముల్లుకి తగులుకొని మరణించేదికూడా మోహం వల్లనే. ఈ సత్యాన్నే రామాయణ రచయిత ఏమన్నారంటే, “కామ, క్రోధ, మద, లోభ పరాయణ నిర్దయకపటీ కుటిల మలాయన। బయరు అకారస సబకాహుసో – శోకరహిత అనహిత తాహుసో ॥” పనిలేని సోమరులు, క్రోధ స్వభావులు, మదం, లోభం, నిర్దయ, కపట స్వభావులు, కుటిలపరులు – వీరు నివసించేవి పాపగృహాలు. వీరు అకారణంగా అందరితోను విరోధిస్తారు. తమకు మంచిచేసిన వారికి కూడా వీరు చెడునే చేస్తూ ఉంటారు.

**కథ 81 :** కరువు కాటకాలతో బాధపడుతూన్న ఒక గ్రామంలోని వ్యక్తులు ఒక యువకుని వద్దకు వెళ్ళి, తాము ఆకలితో మరణిస్తున్నామని, ఎక్కడా తిండిగింజలు లభించడంలేదని మొరపెట్టుకుంటారు. “అన్నరాసులను ఎవరైనా దొంగిలించి దాచిపెడుతున్నారా ?” అంటూ యువకుడు సందేహాన్ని వ్యక్తం చేశాడు. ప్రజలు మౌనంగా తలలు వాల్చడంతో ఈ కరువు రోజుల్లో కూడా తిండి గింజలను దాచి, ప్రజలను ఇబ్బందులకు, మరణాలకు గురిచేస్తున్న వ్యక్తులెవరో ఉన్నారని, వారి పేరు చెప్పడానికి భయపడుతున్నారని యువకుడు అర్థంచేసికొంటాడు. ప్రజలకు ధైర్యాన్నిస్తూ, “ప్రజలారా! తెలిస్తే పేర్లు చెప్పండి. వారెవ్వరయినా సరే! మీకు భయం లేదు” అని పల్కడంతో ప్రజల మధ్య నుండి ఒక హీనస్వరం, “నీ తండ్రేనని” బదులు పల్కింది. యువకుని కన్నులు ఎర్రబడ్డాయి. గ్రామవాసులను వెంట బెట్టుకొని వెళ్ళి, తండ్రి గోదాములలోనికి ఉరికి, మొత్తం ధాన్యపు రాశులను బయటకు తీసి, గ్రామవాసులందరకు పంచివేశాడు. ఆదర్శవంతుడైన ఈ యువకుడే తరువాత ఇంటిని, స్వార్థపరుడైన తండ్రిని వదలివేసి, సమాజ సేవకునిగా సమాజంలోనికి చొచ్చుకొనిపోయాడు.

**కథ 82 :** కౌసంబీరాజ్యంలో క్షామం యేర్పడి, ప్రజలు ఆకలితో మృతులవ్వటం వలన అనేక గ్రామాలు, పట్టణాలు కూడా ఖాళీ అయిపోయాయి. ఈ రాజ్యంలో చెంపక్ అనే పేరుగల ఒక వ్యక్తి కూలి పని జీవనోపాధిగా రోజులు గడుపుతూ లభించిన దానితో కనీసం పిల్లల ఆకలి కూడా తీర్చలేక పోయాడు, వారు

కూడా మరణించగా ఒకనాడు పని దొరకక తిరిగి ఇంటికి వస్తూంటే ఒక స్వర్ణాభరణం కంటబడింది. పరాయి సొమ్ముపై భార్య దృష్టి పడకుండా దానిపై దుమ్ము చల్లటానికి చంపక్ ప్రయత్నించాడు. భార్య ఇది గమనించి, "స్వామీ! ఇంతటి గడ్డు పరిస్థితులలో కూడా నిర్లోభిగా, పరాయి సొమ్మును ఆశించని మీకు భార్యగా నేను మీ ఆదర్శాలకు అడ్డు నిలుస్తానని ఎలా అనుకున్నారు ? పదండి" అంటూ స్వర్ణాభరణాన్ని దాటి ముందుకు సాగింది.

దైవం పైనుండి ఇదంతా చూస్తూ, అత్యంత ఆనంద భరితుడై ఇటువంటి దేవ దంపతులున్న ప్రదేశంలో కరువు కాటకాలుండటానికి వీలులేదని భావించి వెంటనే కుంభవృష్టిగా వర్షాన్ని కురిపించి భూమిని సస్య శ్యామలం గావించాడు.

**కథ 83 : లో**భ, మోహాలను జయించినంత మాత్రాన వ్యక్తి, పరమార్థిక మార్గంలో నిరాటంకంగా పయనించ గలడనుకోవటానికి వీలులేదు. వ్యక్తి పయనించే మార్గంలో అతిపెద్దదైన, అభేద్యమైన అవరోధం **"అహంభావం"**. ఇది ప్రత్యక్షంగా కనిపించదు. వ్యక్తికి దొరక్కుండా, నక్కినక్కి పరోక్షంగా దాగి ఉంటుంది. **గొప్పవాడిని కావాలనే లాలస "అహంభావానికి" అసలైన నిర్వచనం.** దీనివల్ల వ్యక్తి ఎంతగా పతనమవుతాడంటే, ఒక విధంగా లోభత్వం, వ్యామోహం వల్ల జరిగే హానే నయమని చెప్పవచ్చు. **సంస్థలు, సమూహాలు, సర్వనాశనం కావటానికి, "అహంభావం" అత్యంత ప్రధానమైన కారణం**గా పేర్కొనబడింది. దీనిని రావణుని సోదరియైన **"శూర్పణఖ"**గా పేర్కొనవచ్చు. చాలామంది అహంభావం వల్ల, సృష్టికర్త నాటిన ఉద్యానవనానికి తామే జాగీరుదారులమని అపోహపడుతూ ఉంటారు. పైపైకి తోటమాలినని, సేవకుణ్ణని, కబుర్లు చెబుతూనే ఆచరణలో ఈ భావన ఏమాత్రం చూపరు. కబుర్లకి ఆచరణకి అసలు పొంతనే ఉండదు.

**కథ 84 : ఒ**క రాజుకి తాను ఈ జగత్తుకంతకు పాలకుడనని, ప్రభువునని అహంకారం ఉండేది. మనువు దగ్గర నుండి శాస్త్రకారులందరూ కూడా అజ్ఞానం వల్ల, కనిపించని ఆ విష్ణువుని జగత్పాలకుడుగా కీర్తించి, శాస్త్రాలకు ఎక్కించారని నిందించేవాడు.

ఒక సన్యాసి ఈ పట్టణం చివరలో చెట్టుక్రింద ఉన్నాడని, ప్రజలు ఆయన శాంతి వచనాలను, తీయని వాక్యాలను వినటంకోసం తండోపతండాలుగా వెళ్తున్నారని విని, రాజు కూడా సన్యాసి దర్శనార్థం వెళ్ళి తనని తాను అందరినీ పాలించే ప్రభువుగా పరిచయం చేసుకుంటాడు. స్వామీజీ చిరునవ్వు నవ్వి, రాజా! నీ రాజ్యంలో కాకులు, కుక్కలు ఎన్ని నివసిస్తున్నాయో కాస్త తెలియచేయుమని ప్రశ్నిస్తాడు. రాజు సమాధానం చెప్పలేక తికమకపడతాడు. స్వామీజీ, రాజు వంక చూచి, కనీసం రెండు జీవరాశుల సంఖ్యలైనా చెప్పలేని నీవు వాటి భోజన సదుపాయం ఎలా చేయగలవు? ప్రభువు తన బిడ్డలందరకు తిండి కూడా పెట్టనపుడు ఆపదవి నలంకరించి యేమి ప్రయోజనం ? అని అడిగినపుడు రాజు సిగ్గుపడ కుండా, "అయితే స్వామీ! మీరు చెప్పిన ప్రభువు తన బిడ్డలందరకూ తిండి పెడుతున్నాడంటారా ? ఋజువు చేయండంటూ" ఒక చీమను డబ్బాలో బంధించివేస్తాడు. మర్నాడు భోజన సమయానికి మూత తెరచి చూడగా, ఆ చీమ ఒక బియ్యపు గింజ ముక్కను ఎంతో ప్రేమగా తింటూ కనిపించింది. అది చూచిన రాజు అహంభావం తొలగింది. అందరికీ ప్రభువు, ఆ భగవంతుడేనని అంగీకరిస్తాడు.

సమర్థగురు రామదాసు ఈ విధంగానే శివాజీయొక్క అహంభావాన్ని గూడా నశింపజేసి అతనికి వాస్తవాన్ని ఎరుకవరుస్తాడు.

**కథ 85 :** ఇద్దరు పండితులు ఒక గృహస్థు ఇంటికి ఆతిథ్యానికి వెళ్ళటం జరిగింది. పరోక్షంలో ఇద్దరు పండితులను విడివిడిగా ఒకరిపై ఒకరికి గల అభిప్రాయాలను గురించి గృహస్థు ప్రశ్నించగా, మొదటి పండితుడు రెండవ పండితుడిని గూర్చి తెలుపుతూ ఒక ఎద్దువంటివాడని, రెండవ పండితుడు మొదటి వాడొక గాడిదవంటివాడని, వారివారి అభిప్రాయాలను వెళ్ళగ్రక్కుతారు. స్నానానంతరం భోజనాలకు పండితులు ఆసీనులవ్వగానే గృహస్థు మొదటి పండితుని ముందు చిట్టు, పొట్టు; రెండవ పండితుని ముందు గడ్డిని వడ్డించి ఆరగించుమంటాడు. విద్వాంసులు, పండితులుగా చలామణి అయ్యే ఉన్నతులు కూడా మనోమాలిన్యాన్ని ప్రకటిస్తూ ఇతరులను తక్కువ చెయ్యాలని భావించేటప్పుడు ఇటువంటి పరిస్థితుల ద్వారా గుణపాఠాలను నేర్చుకోవడం తప్పనిసరి అవుతుంది.

**కథ 86 : లో**కసేవకులు ఏవిధంగా ఉండాలి ? అనే దానికి చక్కని ఉదాహరణ కృష్ణభగవానుని జీవిత చరిత్రలో లభిస్తుంది. జగన్నాయకుడైన కృష్ణుడు పాండవ పక్షంలో అక్షరాలా స్వయం సేవకుని పాత్ర నిర్వహించటం జరిగింది. తనకు రథసారథ్యం వహించిన నిరభిమాని, అహంకార శూన్యుడు అయిన కృష్ణభగవాను డొక్కడూ తమ పక్షాన ఉంటే చాలునని, మిగిలిన యావత్ సేనను దుర్యోధనునికి అర్జునుడు ఇచ్చివేయటం తెల్సిన విషయమే.

అలాగే రాజసూయ యజ్ఞ సమయంలో అందరికీ ఎవరి పనులు వారికి వప్పగించబడ్డాయి. శ్రీకృష్ణుడు తనకు కూడా ఏదో ఒక పనిని ఇవ్వమని పదే పదే ప్రాధేయపడినా, 'నీకు ఇవ్వతగిన పని మా వద్ద లేదు ప్రభూ' అంటూ పాండవులు నిరాకరించటం జరిగింది. కానీ కృష్ణుడు అలా అడుగుతూనే ఉండటం వలన కాదనలేక నీకు బాగా నచ్చిన పని ఏదో ఒకటి తీసుకోమంటారు. ఆ విధంగా కృష్ణ పరమాత్మ యజ్ఞారంభం నుండి ముగింపు వరకు అతిథుల పాదాలు కడగటం, భోజనానంతరం వారి ఎంగిలి ఆకులు తీసి శుభ్రం చేయటం వంటి పనులను స్వీకరిస్తాడు. యీ విధంగా సాక్షాత్తు భగవంతుడే లోకసేవకుల దృష్టిలో యేపనిపట్ల చిన్న చూపు ఉండరాదని నిరూపించటం జరిగింది.

**శ్లో॥ పూజయా ఽపి ప్రసీదన్తి తేషు దేవాన కింతుతే ।**
**దురాత్మానాం మనోభావం జ్ఞాత్వా కృధ్యంతి నిత్యశః ॥**
**సంతాపం సమయత్యేనాం పూర్ణతో భక్తిభావనా ।**
**అతో భక్తిశ్చ ముక్తిశ్చ సఘనే సంయుతేమతే ॥**
**స్వార్థాంధతాం నరో యావన్మాత్రయా యోత్యజత్యసౌ ।**
**అనుపాతేన తేనైవ జీవన్ముక్తో భవిష్యతి ॥**

లోభం, మోహం, అహంకారం – వీటికి దాసులైన వ్యక్తులు పూజలు, అర్చనలు, ఎంత ఆడంబరంగానూ, వైభవంగానూ జరిపినప్పటికీ, దేవతలు క్రుద్ధులౌతారేకాని ఏ మాత్రం ప్రసన్నతను చూపజాలరు. తమ స్థాయిని మరచి నీచ కృత్యాలకై ప్రాకులాడే స్వార్థపరులైన వీరి ఆచరణలు దుష్ట చింతనలు, దైవానికి అర్థం కావనుకోవటం మానవుల వెర్రితనం. వారి నగ్న హృదయం దాచాలన్నా దాగక స్పష్టంగా కన్పిస్తూనే ఉంటుంది.

దైవం భావప్రియుడు. ప్రజలు ఆచరించే కర్మకాండల వెనుక నుండే భావనకోసం పరితపిస్తాడు.

**విద్యాలయాలలో నేర్చుకున్నదంతా మరచిపోయిన తర్వాత మిగిలేది విద్య.**

ఆ భావన లోపించిన యాంత్రిక కర్మకాండలద్వారా ప్రజలు తనను మోసగిస్తున్నారని గుర్తించిన తక్షణం దైవం వారికి అందనంత దూరంగా పారిపోవటం జరుగుతుంది. భావనా పూర్వకంగా తన సర్వబాధ్యతలు, సర్వ శక్తులు దేవుని పాదాల ముందు సమర్పించటం వలన వ్యక్తి జీవించి ఉండగానే అనంతమైన శాంతిని, ముక్తినీ పొందగల్గుతాడు. ఈ విధంగా నెమ్మదిగా బంధవిముక్తుడు కాగానే భగవానుడు భక్తుడు పరస్పరం దగ్గరవుతారు. అంధకారం నుండి ప్రకాశం వైపు అనంతమైన పయనం నిరాటంకంగా సాగిపోతుంది.

**కథ 87 : ఒ**క సాధువు, ఒక దొంగ ఒకేసారి యమధర్మరాజు కొలువుకు చేరుకొంటారు. ఇద్దరి కృత్యాలను అవలోకనం చేసిన యముడు తమ గురించి ఏమైనా చెప్పుకోవటానికి ఇద్దరికీ అనుమతి నిస్తాడు. దొంగ వినమ్రుడై చేతులు జోడించి, మహానుభావా! జీవితంలో అనేక పాపాలు చేసిన వాడిని. మీ నియమ నిబంధనల ననుసరించి నాకు ఏ శిక్ష విధించాలంటే అది విధించండి. సిద్ధంగా వున్నానని పల్కుతాడు. అలాగే సాధువుకూడ యమునితో తాను జీవితాంతము భక్తి ప్రపత్తులతో గడిపిన వాడినని, కాబట్టి సమస్త సుఖ సాధనలు వెంటనే సమకూర్చ వలసినదని తెలియజేస్తాడు. యమధర్మరాజు దొంగవంక తిరిగి, అయితే ఈ రోజు నుండి నీవు ఈ మహాభక్తునికి సేవచేయుమని ఆజ్ఞాపిస్తాడు. దొంగ ఆ ఆజ్ఞను శిరోధార్యంగా స్వీకరిస్తాడు. కానీ సాధువు తిరస్కరిస్తూ నా భక్తి, నా తపస్సు ఈ దుష్టుని స్పర్శవల్ల అపవిత్రమై నేను భ్రష్టుడినైపోతాను. కాబట్టి ఇతని సేవలు నాకక్కరలేదంటాడు.

కుకర్మలు ఆచరించినప్పటికీ సాధువుకు సేవ చేయటమనే సత్కర్మను ఆచరించటానికి దొంగ ఆనందంగా అంగీకరించాడు. "కానీ సాధువు మహాత్ముడు అయివుండి కూడా నీవు అతనిలోని పరమాత్మను, సేవాతత్పరతను దర్శించలేక, అతని చెడును దర్శిస్తున్నావు. సత్కర్మలు ఎన్నిచేసినా **భావ శూన్యుడివి కావటం వలన నీకు అధోగతి తప్పదు.** కాబట్టి ఈరోజు నుండి దొంగకు నీవే సేవచేయుమని" యమధర్మరాజు సాధువుని ఆజ్ఞాపిస్తాడు.

**కథ 88 : ఒ**క పతివ్రత, ఒక వేశ్య ఎదురెదురు ఇళ్ళలో నివసించేవారు. పతివ్రత అను క్షణం వేశ్య పనులన్నీ గమనిస్తూ వీలైనప్పుడల్లా ఆమెను నిందిస్తూ తిడుతూ ఉండేది. కానీ వేశ్య అలాకాక పతివ్రత పట్ల ఆరాధన నింపి కురూపి, గుణహీనుడు అయిన భర్తకు ఏకాగ్రతతో సేవలు చేస్తున్న ఈ ఇల్లాలు సాక్షాత్తు దేవతగా భావించి అవకాశం చిక్కినపుడల్లా ఆమెను స్తుతిస్తూ, అభినందిస్తూ ఉండేది. అదృష్టం వలన కొంతకానికి ఒకేసారి ఈ ఇద్దరి స్త్రీల ఆత్మలు స్వర్గం చేరుకున్నాయి. కానీ వేశ్య పతివ్రత కంటె ఉన్నతమైన లోకంలో సుఖాలు అనుభవించడం చూచి పతివ్రత కోపించి ఈ న్యాయనిర్ణయం సముచితంగా లేదని యమధర్మరాజుకి ఫిర్యాదుచేసింది. ఫిర్యాదు నాలకించి యమధర్మరాజు, "అమ్మా! ఆచరించే కర్మలు ఎటువంటివైనా అంతఃకరణలో నిండివున్న ఉత్కృష్టమైన భావనల వల్ల వేశ్యకు ఉచ్చస్థాయికి చెందిన లోకాన్ని, సదుపాయాలను ప్రసాదించక తప్పదు. **శరీరంకంటే మనస్సు శ్రేష్ఠమైనది. క్రియకంటె భావన ఉత్కృష్టమైనది. స్వర్గ సంహిత ననుసరించి న్యాయనిర్ణయం కావించేటపుడు మనస్సుకు, భావనకే విలువనిచ్చి పుణ్యాపాపాలను లెక్కకట్టి వాటి ఆధారంతోనే ఫలితాలను నిర్ధారణ గావించటం జరుగుతుంది"** అని తెలియజేస్తాడు.

**కథ 89 : "భక్తి"**కి సరియైన నిర్వచనం దీనులు దుఃఖితులు పట్ల అంతరంగం నుండి ఉద్భవించే పరమార్థ భావనే.

**విమర్శకుణ్ణి మన ఇంటిలో ఉంచుకోవాలి. నీరు సబ్బు లేకుండా అతడు మనల్ని శుభ్రపరుస్తాడు.**

స్వర్గద్వారాలను తెరచి ఉంచి, సాక్షాత్తు దైవమే ద్వారం ముందు నిలబడి ఇటువంటి పరమార్థ పరాయణులను రండి రండి అని ఆహ్వానిస్తూ, అయ్యలారా! నేను ఆకలితో ఉన్నపుడు తిండి పెట్టింది మీరు, నిరాశ్రయుడిగా ఉన్నపుడు ఆశ్రయమిచ్చింది మీరు, చలితో వణుకుతూ నగ్నంగా పడిఉంటే బట్ట కప్పింది మీరు, మీ రాకతో ఈలోకం ధన్యమైంది అంటూ లోనికి తోడ్కొనిపోవటం చూచి ధర్మాత్ములు ఆశ్చర్యంతో, దేవా! ఇవన్నీ నీకు మేము చేయటం ఏమిటయ్యా ! అని ఆందోళనతో ప్రశ్నించేరు.

దైవం వారివంక భక్తి ప్రపత్తులతో వీక్షిస్తూ, తండ్రులారా! దరిద్రులు, దుఃఖితులకు మీరు చేసినవన్నీ నేనే అందుకొంటాను. ఆ కృతజ్ఞతతోనే మీకోసం స్వర్గద్వారాలు తెరచివుంచి నిరీక్షిస్తున్నాను" అని దైవం బదులు పల్కుతాడు. ఈ విషయాన్ని చైతన్య మహాప్రభువు శిష్యులకు తన ప్రవచనంలో తెలియజేస్తాడు.

**కథ 90 : ఒ**క ప్రాయశ్చిత్త పర్వదినాన భక్తులందరూ దైవ ప్రార్థనలు జరుపుతూ ఉండగా, ఏ విధమైన పూజా విధానాలు, స్తోత్రపఠనాలు తెలియని ఒక గ్రామీణుడు కూడా ఒక వారగా కూర్చొని చింతిస్తూ తనకు తెలిసిన వర్ణమాలలోని కొద్దిపాటి అక్షరాలనే పదే పదే ఉచ్చరిస్తూ, స్వామీ! నాకు తెల్సిన అక్షరాలనే మంత్రంగా భావించి నీముందు పల్కుతున్నాను. ఈ దాసుడు నీ పూజకోసం క్రొత్త భావనలను ఎక్కడనుండి తెచ్చుకోలేనివాడు. కాబట్టి ఈ మంత్రాన్ని స్వీకరించి నన్ను ఉద్ధరించు అంటూ ప్రార్థించసాగేడు. ఈ విధంగా ఆ పర్వదినాన చాలా వైభవంగా కార్యక్రమాలు జరిగాయి. సాయంత్రం ధ్యాన సమయంలో ధర్మగురువు ఈ గ్రామీణ యువకుని పిలచి భక్తుల పంక్తిలో ప్రథమ స్థానంలో కూర్చుండబెడతాడు. మంత్రమైనా పలకడటం రాని ఈ గ్రామీణ యువకుని గురించి మిగతా శిష్యులకు తెలియజేస్తూ, నాయనలారా! ఇతని వద్ద విద్య లేక పోవచ్చు. పలకటానికి స్తోత్రాలు శబ్దాలు లేకపోవచ్చు కానీ మహోత్కృష్టమైన భావనలున్నాయి. భక్తునికి ఉండవలసిన అర్హత ఇదేనని తెలియజేస్తాడు.

**శ్లో॥ ఈశ ప్రాప్తేర్భక్తిరేకమవలంబన మస్తిహి ।**
**ఉదారాత్మీయ భావానుప్రాణితా ధర్మవాదినీ ॥**
**సా పరాయణతా యాతు పరార్థా తత్ర దృశ్యతే ।**
**భక్తేః సాభావనా సత్యాయయా దివ్యత్వ మాప్యతే ॥**

ఈశ్వర ప్రాప్తికి ఏకైక ఆధారం భక్తి. ఉదార ఆత్మీయతతో అనుప్రాణితమైన అంతరంగం నుండి ఉప్పొంగే పరమార్థ పరాయణత్వంలోనే నిజమైన భక్తి దర్శనమిస్తుంది. జీవాత్మను పరమాత్మతో ముడివేసే సూత్రమే భక్తి. బాహ్య కర్మకాండలలో ఇరుక్కోకుండా పరమాత్ముని ఈ దివ్య స్వరూపాన్ని అవగతం చేసుకున్నవారు లక్ష్య శూన్యులై తిరుగాడవలసిన పని ఉండదు.

**కథ 91 : ఒ**క వ్యక్తి ఒక మహాత్ముని వద్దకు వెళ్ళి, తన హృదయం చాలా కఠినమైనదని, దానిని సరళంగా మార్చటానికి ఏదైనా సాధన తెల్పుమనీ ప్రార్థిస్తాడు. మహాత్ముడు అతని శిరస్సు మీద చేయవేసి సున్నితంగా నిమురుతూ, "నాయనా! బాధల్లో ఉన్నవారి శిరస్సుపై చేయివేసి ఈ విధంగానే నీవు కూడా నిమురుతూ, నీకున్న రొట్టెను ఆకలితో ఉన్న వారితో కలసి పంచుకొని తిను. చాలు ! ఇంత కంటే ప్రత్యేక సాధనలు ఏమీలేవ"ని తెలియజేస్తాడు.

**ప్రతి పండుకూ ఒక పువ్వు కారణం. ప్రతి మంచి పనికీ ఒక విశ్వాసం కారణం.**

**కథ 92 :** మిథిలా నగరంలోని మహానందుడు జీవితంలోని 3 దశాబ్దాలు కఠిన తపస్సు చేస్తాడు. జపం, తపం, స్వాధ్యాయం, ప్రాణాయామం, యజ్ఞం ఒకటేమిటి అనేకమైన కర్మకాండలు ఆచరించి అనేక సిద్ధుల్ని హస్తగతం చేసుకొంటాడు. ఆయన ఖ్యాతి సర్వత్రా వ్యాపించింది. వేల సంఖ్యలో ప్రజలు మహానందమునిని దర్శించి వారి అసాధారణ శక్తుల ద్వారా లాభాన్ని పొంది, వారి సన్నిధిలో పరమసుఖాన్ని అనుభవించేవారు. కానీ మహానందుని అంతఃకరణ స్థిరంగా ఉండేదికాదు. ఏ శాంతి నిమిత్తమై ఇల్లు, సంసారం, బంధుజనులు, సుఖసాధనాలు సర్వస్వం వదలివచ్చాడో ఆశాంతి ఏమాత్రము లభించక విచారంతో ఒకనాడు కుటీరాన్ని వదలి కాలినడకన వెళుతూఉండగా ఒక గ్రామంలో ఒక గుడిశెలో ఒక వ్యక్తి బాధతో పెద్దగా మూల్గడం వినిపించింది. మహానందుడు ఆగి, గుడిశెలో ప్రవేశించి రోగంతో బాధపడుతున్న ఆ వ్యక్తికి రోజంతా సేవచేస్తాడు. మందువేయటం దగ్గరనుంచి అతని మలిన వస్త్రాలను ఉతకటం వరకూ, సర్వోపచారాలు చేసి తెల్లవారు ఝామున తన కుటీరానికి చేరుకొంటాడు. అతడు 24 గంటలుగా సంధ్యావందనంగాని, నిత్య పారాయణగానీ, నిధిన్యాసం గానీ యేదీ ఆచరించలేదు. అయినా మనస్సు అపూర్వమైన శాంతితో నిండి తెలియని ఆనందంతో చాలా తృప్తిగా ఉన్నది.

తపోసాధనాల ద్వారా ఆర్జించిన జ్ఞానాన్ని సరిగ్గా ఉపయోగించకపోవటం వల్లనే అంతరంగంలో అశాంతి యేర్పడుతుందని, **సాధన సేవ రూపంలో ఆచరణగా మారాలని** మహానందునికి అవగత మయ్యింది. దీనులు, దుఃఖితుల సేవకోసం పరితపించే పరమాత్ముని పట్ల తాను నిర్లక్ష్యంగా వ్యవహరించానని, విలువైన కాలాన్ని వృధాచేశానని గుర్తించిన మరుక్షణం ఆయన శాశ్వతంగా కుటీరాన్ని వదలి లోక సేవకుడుగా సమాజంలోనికి ప్రవేశించాడు.

**కథ 93 : ఒ**క అడవిలో ఒక మహాత్ముడు నివసించేవాడు. ఆయన అతిథి ప్రియుడు. తన కుటీరం ముందు నుండి పయనించే ప్రతి బాటసారిని ఆదరంగా పిలచి, సేవచేసి భోజనం పెట్టేవాడు. ఒకనాడొక వృద్ధుడు అతిధిగా రావటం జరిగింది. వృద్ధుడు భోజనం ముందు కూర్చొని పరబ్రహ్మ స్వరూపమైన అన్నానికి ధన్యవాదాలు చెప్పకుండా దైవానికి నివేదన చేయకుండా అమాంతం భోజనానికి ఉపక్రమించడం మహాత్మునికి నచ్చలేదు. వృద్ధుడిది గమనించి నేను దైవాన్ని, దేవతలను విశ్వసించనంటూ నిర్లక్ష్యంగా మాట్లాడటం మొదలు పెట్టడంతో మహాత్ముడు దైవ నిందను భరింపజాలక భోజనం ముందు నుండి అతణ్ణి నిర్దాక్షిణ్యంగా బయటకు పంపివేస్తాడు. ఆ రాత్రి మహాత్మునికి పరమాత్ముడు స్వప్నంలోనికి వచ్చి, “నాయనా! నీవు ఇంతకాలం చేసిన అతిధి సత్కారం ద్వారా లభించిన పుణ్యం వృద్ధుని పట్ల ఈ ఒక్కరోజు ప్రవర్తనవల్ల నశించిపోయింది. ఆకలితో ఉన్న నా బిడ్డపట్ల నీ ప్రవర్తన బాగోలేదని పల్కడంతో మహాత్ముడు కలవరపడుతూ, ”ప్రభూ! ఆ వృద్ధుడు నిన్ను అవమానించటం భరించలేక ఆవిధంగా చేసానని” నివేదిస్తాడు. దైవం ఒక నవ్వునవ్వి, నాయనా ఆ వృద్ధుడు ప్రతిరోజు నన్ను అవమానిస్తూనే ఉన్నా, నేను సంవత్సరాల తరబడి భరిస్తున్నానే గాని అతడికి నేను ఏ కష్టమును కల్గించలేదు. కానీ నీవో! దైవనింద చేశాడనే నేరంతో దైవంలాంటి అతిథిని అవమానించి వెళ్ళగొట్టావు” అని పల్కి అంతర్ధానమవుతాడు. ఆ పల్కులు మహాత్ముని మనో నేత్రాన్ని తెరిపించాయి.

**శరీరం విస్తరివంటిది. భోజనం తర్వాత విస్తరిని పారవేస్తాం. శరీరమూ అంతే.**

శ్లో॥ **యధా వేలాదినే నేయం రాత్రౌతు మిలనస్యహి ।**
**ఉషఃకాలో బుధైః ప్రోక్తః ప్రాణినో యత్రజాగృతి ॥**
**పరాత్మనాత్మనః సంగస్యాస్తి నూనం తధాత్వయమ్ ।**
**భక్తిభావోదయోహ్యేష ప్రమాణమిహ గోచరమ్ ॥**

రాత్రితో పగలు సమాగమం చెందే సమయం ఉషఃకాలంగా చెప్పబడుతుంది. ఆ సమయంలో జగత్తులోని ప్రాణులన్నీ మేల్కొంటాయి. ఇదే విధంగా **భక్తి భావన యొక్క ఉషోదయంలోనే ఆత్మ పరమాత్మల యొక్క కలయిక ప్రత్యక్షంగా దర్శనమిస్తుంది.** అంతరంగంలోని అంధకారాన్ని తొలగించే దివ్య ప్రకాశం భక్తి. ఆత్మ పరమాత్మతో కలవటం జీవితం యొక్క పరమలక్ష్యం. ఆ తీయతను వ్యక్తి బాహ్యరూపంలో ఎంత ఎక్కువగా పంచగల్గితే అంతగా అతడు అంతరంగం ద్వారా భగవంతునికి చేరువ అవుతాడు. తన శక్తిని పరమాత్మ శక్తితో ఏకం చేస్తూ, తన మూల అస్తిత్వాన్ని ఎంత ఎక్కువగా విస్మరించగల్గితే అంతగాను ఈ సాధన సాధ్యమవుతుంది.

**కథ 94 : అ**ర్జునుడొకనాడు వేణువుకు వందన మాచరించి, "ఓ పూజ్యురాలా! నిన్ను కృష్ణ పరమాత్మ సర్వకాల సర్వావస్థలయందు తన పెదవులమధ్య ధరించి ఆదరిస్తూంటాడు. ఆయన కృపకు మేమంతా ఎంత ప్రయత్నించినా నీకు దక్కిన అదృష్టంలో గోరంతైనా మాకు లభించటం లేదు. ఇంతటి భాగ్యం నీకు లభించటంలోగల రహస్య మేమిటి ?" అని ప్రశ్నిస్తాడు. వేణువు అర్జునునితో, "అర్జునా! నాకు లభించిన భాగ్యం కూడా నేను ప్రయత్నించకుండానే లభించినది కాదు. ఆ పరమాత్ముని కృప కోసం నేను నా అస్థిత్వాన్నే కోల్పోయి ఆయన పల్కించినటుల పల్కుతూ నన్ను నేను సమర్పణగావించు కొన్నాను" అని బదులు పలికింది.

సొంత స్వరాలనేవి పలుకకుండా, వాయించేవాని స్వరాలకోసం పూర్తిగా ఖాళీగా ఉండగల్గటమే మురళి యొక్క విశిష్టత. దైవం పెదవుల మధ్య సతతమూ అమరి ఉండటానికి కావలసిన అద్భుతమైన సూత్రమేమిటో మురళినుండే అర్జునునికి లభించినది.

శ్లో॥ **ఆదర్శాత్స్రుతి భక్తిః సాభవత్యేనాం తు వ్యక్తిభిః ।**
**దేవతాభిస్తు కాభిశ్చిద్ యోజకాత్తు మహామునే ॥**
**భిన్నాం మోహ ప్రసంగాశ్చ మన్యత ఉచ్చ సంశ్రయామ్ ।**
**జ్ఞానస్య కర్మణో భక్తేస్త్రివేణ్యాం తత్ర తద్దినే ॥**
**స్నాతా జిజ్ఞాసవో జాతాః ప్రసన్నాస్తే మనీషిణః ।**
**అజ్ఞాయి బ్రహ్మవిద్యాయా గుప్తానాం రహసామలమ్ ॥**
**లాభో అసాధారణ స్త్వస్మిన్ సత్సంగే ప్రాప్యతేతుతైః ।**
**ఇద్ధం సత్రం సమాప్తం తచ్చతుర్థంతే మనీషిణః ॥**

ఉదార భక్తిభావనా ప్రకరణాన్ని ముగిస్తూ మహాప్రజ్ఞయైన పిప్పలాద మహర్షి భక్తిని గూర్చి పునఃప్రస్తావిస్తూ జిజ్ఞాసువుల వంకతిరిగి, "ఓ మునిపుంగవులారా! **భక్తి అనేది ఒక వ్యక్తితోగాని, దేవీ దేవతలతోగాని ముడిపడి ఉండే మోహప్రసంగాలకు పూర్తిగా భిన్నమైనది. ఉచ్చస్థాయికి చెందినది.**

**శీలం లేని మనిషి చిల్లుల కుండ.**

ఆదర్శాలతో పెనవేసుకొని ఉన్నది. కాబట్టి భక్తిని సరియైన రీతిలో హృదయానికి హత్తుకొనేలా అవగతం చేసుకోవాలి" అని అంటూ ఈ దిగువ కథను వినిపించారు.

**కథ 95 :** ఒక గదిలో అగరువత్తి ఒక మూల, క్రొవ్వువత్తి మరొక మూల వెలుగుతున్నాయి. ఎక్కువ వెలుగునిస్తున్న క్రొవ్వువత్తి అగరువత్తిని నిర్లక్ష్యంగా చూచి, "నా ప్రకాశం ఎంతగానో వ్యాపించటం వల్ల నన్నందరూ గౌరవిస్తూ ఉంటారు" అని పలికింది. అగరువత్తి ఆ మాటలకు వినయంతో, "సోదరీ! కఠినమైన పరీక్షాసమయము ఆసన్నమైనపుడు ధైర్యంతోను, సాహసంతోను ఎవరి స్థానాలలో వారు అచంచలంగా నిలబడగలగాలి. అప్పుడే ప్రకాశం సార్థకమవుతుంది" అని బదులు పలుకుతుంది. క్రొవ్వువత్తి ఆ మాటలను లక్ష్యపెట్టలేదు. కానీ క్షణంలో పెద్ద గాలి వీచగా క్రొవ్వువత్తి గుప్పున ఆరిపోయింది. అగరువత్తి మాత్రం ఏమాత్రం చలించక ఎప్పటిలాగే తన సుగంధాన్ని వెదజల్లుతోంది.

"భక్త జనులు కూడా ఇదే విధంగా అహంకారాన్ని వీడి, దేవతలపట్ల, వ్యక్తులపట్ల, మోహాన్ని పెంచుకోక ఆదర్శాలకు ప్రతిరూపుడైన ఈశ్వరునిపట్ల మాత్రమే స్థిరవిశ్వాసముంచి జీవయాత్ర సాగిస్తారు" అంటూ మహర్షి వినిపించగా జిజ్ఞాసువులు అత్యంత ఆనందభరితులై ఈ సత్సంగం ద్వారా తమకు బ్రహ్మ విద్యయొక్క అసాధారణమైన ఫలం దక్కినట్లు భావన చేసికొని జ్ఞాన, కర్మ, భక్తియొక్క త్రివేణిలో స్నానమాచరించి పునీతులై మహర్షి వద్ద సెలవు తీసికొన్నారు.

**ఇతి శ్రీమత్ ప్రజ్ఞాపురాణే శ్రీ పిప్పలాద శ్వేతకేతు ఋషి సంవాదే**

**"ఉదార భక్తి భావనే" ఇతి ప్రకరణోనామ పంచమోధ్యాయః.**

